**త్రిపుర:** (సిగరెట్ వేళ్ళమధ్య పెట్టి బాగా ఎగపీలుస్తూ) గ్రామ్య భాషలో రాశాడు కన్యాశుల్కం. అందులో బ్రాహ్మణ్యాన్ని ఏకి పారేశాడు (నవ్వు). అయితే నాకు మాత్రం వేశ్యలంటే పడదు.

**మధుర:** నా వృత్తితో మీకేం పని? మీ భావాలు ఆధునికం, నవ్యం. మీ భాష గొడ్డు గ్రాంథికం. అటువంటి భాషలో వెలిగించారే కవిత్వం?

**త్రిపుర:** నాది పండితుల భాష. నేను పండితుడ్నీ, కవిరాజునీ.

**మధుర:** మీ సందేశం మీతో సమానులైన వారిలోకి వెళ్ళింది గాని, సామాన్య ప్రజలలోకి వెళ్ళలేదేమో ఆలోచించారా?

**త్రిపుర:** నింద్యగ్రామ్యం రాస్తే నన్ను కవిరాజనేవారా?

**మధుర:** విశ్వనాథవారూ మీరూ ఒకే పంథాలో వున్నారు. తిక్క కూడా ఒక్కటే.

**త్రిపుర:** నా కతనితో సాపత్యమేమి? నా తిక్క నాది.

**మధుర:** తమ భావాలకు అనువుగాని భాషలో రాశారు పండితులిద్దరూ. ముఖ్యంగా గ్రాంథికం మూల పడుతున్న దశలో మీరు, హేతువాద సూర్యులు అందులోకి వెళ్ళి యిరుక్కుపోయారు (నవ్వు).

**త్రిపుర:** గ్రామ్యభాషలో రాయనందుకు నన్ను తప్పుబడుతున్నావా?
తెలుగు బిడ్డా మరచిపోకుర
తెలుగు దేశము పురిటి గడ్డర
కొక్కొరోకో పాట పాడర
తెలుగు వారల మేలుకొలపర - యిందులో యిబ్బంది ఎక్కడుంది నీకు?

**మధుర:** స్వామీ! మీ కాలానికి మీరు చాలాముందు వుండి భావాలు వెదజల్లారు. అదీ మరుగున పడిపోతున్న గ్రాంథికంలో. మీరు రాసిన మరో పద్యం నాకు చాలా యిష్టం:

వీరగంధము తెచ్చినారము వీరుడెవ్వడొ తెల్పుడీ
పూసిపోదుము మెడను వైతుము పూలదండలు భక్తితో
చాలా గొప్పగేయం, (నవ్వు).

**త్రిపుర:** నవ్వుతావు దేనికి?

**మధుర:** మీ గీతం గిరీశం గారికి చూపిస్తేనూ ఇందులో రామప్పంతులు లాజిక్కు వుందన్నాడు. అది గుర్తుకొచ్చి నవ్వాను.

**త్రిపుర:** ఏవిటా 'రామప్పంతులు లాజిక్కు'?

**మధుర:** వీరగంధంలో గూడా కులాల పిచ్చి వుందా?

**త్రిపుర:** వీరులు కులాతీతులు

**మధుర:** మీరు పైకులాలు పెత్తనం చెలాయించాయని మూమెంటు లేపారు. మీరు కూడా మీకింది కులాల పై పెత్తనం చెయ్యటం లేదా?

**త్రిపుర:** వాళ్ల ఎదురు తిరిగే రోజులూ దగ్గరలోనే వుండవచ్చు.

**మధుర:** యీ కులపిచ్చి కుదిరేదేనా? దీనికంతం లేదా?

**త్రిపుర:** బహుశా యిది రాజకీయాల్లో జొరపడి అల్లకల్లోలం సృష్టించవచ్చు. అంటే యింతవరకూ వీరగంధం ఎవరికీ పూయలేదంటావు?

**మధుర:** స్వామీ! నే ననలేదు. ఆపాట అలా వుంది.

**త్రిపుర:** భలే దెబ్బ కొట్టావే! (నవ్వు).

**మధుర:** లేదు. మీరే గెలిచారు. మీరువచ్చి హేతువాద ఖడ్గం ఝుళిపించే దాకా భూసురుల అగ్రవర్ణపు అధికారాన్ని అడ్డుకొన్న నాథుడేడీ ? కరటకశాస్త్రి తన సొంత పనులకు డిప్టీ కలక్టరుగారి దగ్గరకు పంపితే చచ్చినట్లు వెళ్ళాను కానా? గిరీశం నన్ను డిప్టీ కలక్టరు గారి పుత్రరత్నంగారి దగ్గరికి వెళ్లమన్నా వెళ్లాను. అలాంటి మాకందరికీ ప్రశ్నించడం నేర్పింది మీరే!

**త్రిపుర:**
లోకులు దిట్టిన నిజమే
వాకొనగా గట్టిపట్టు బట్టినవాడన్
లోకుల యిష్టానిష్టము
లా! కవిలోకంబు కలము నాకట్టంగన్.

**మధుర:** మీ అహంకారం గురించి మీరు బాగా చెప్పుకున్నారు. అజ్ఞానమన్నా వుండాలి, అహంకారమన్నా వుండాలి కొందరు కొన్ని పుస్తకాలు రాయడానికి.

**త్రిపుర:**
అతిశయ భక్తిన్ వినుమా
ప్రతిభాషింపకయె తెల్గుబాస కుమారా!
అతి మధురం బతిపేశల
మతి పేయముకాదె బాసలన్నిటిలోనన్.

**మధుర:** మీకు సంస్కృతం అంటే ఏవన్నా చిరాకా?

**త్రిపుర:** నో!
ఒక్కభాష ప్రియమ్మ నొండొక్కభాష
విప్రియమ్మ నాకనుమాట వెగటు మాట
అయిన నే సొక్కుచుండెద నాంధ్రభాష
అతి మనోహర మగుటచే నాలకించి.

**మధుర:** మీ కవిత్వం (అంటే పద్యాలు) సాటి అబ్రాహ్మణ కవులు మెచ్చుకున్న దానికంటె ఏవెంకట శాస్త్రిగారో, విశ్వనాథవారో అట్లాంటి ఇంకొకరో మెచ్చుకుంటే ఎక్కువ సంతోషించేవారట కదా!

**త్రిపుర:** ఎవరు చెప్పారిటువంటివన్నీ నీకు?.

**మధుర:** చీకటి గదులు అనే నవలలో సాక్షాత్తు మీ పుత్రరత్నం గోపీచంద్ వ్రాసాడు.

**త్రిపుర:** మనకంటే తక్కువవాళ్ళు మెచ్చుకుంటే మనకేమానందం? మన ప్రత్యర్థులు గాని, శత్రువులుగాని మన్ని మెచ్చుకోవాలి.

**మధుర:** బాగున్నాయ్ గొంతెమ్మకోరికలు. మీరందరినీ తిట్టొచ్చు కాని, మిమ్మల్ని మాత్రం వాళ్ళు మెచ్చుకుని మేకతోలు కప్పాలి (నవ్వు).

**త్రిపుర:** అలా అన్లేదు నేను. ఎక్కడ నాకు అర్హతవుందో అక్కడ నన్ను గుర్తిస్తే సంతోషిస్తాను నేను.

**మధుర:** మీ పురాణవైరం నిర్హేతుకం, సిల్లీ అంటున్నాను. ద్రావిడులు, ఆర్యులు అంటూ బ్రాహ్మలు లేవదీసిన తగూలు వట్టి కల్పనలట. రాక్షసులు ద్రావిడులు కారు పొమ్మంటున్నారు కొత్త చరిత్రకారులు.

**త్రిపుర:** నీ పాండిత్యం ఎవరిక్కావాలి? నా పురాణవైరం గురించి చెబుతాను విను-

బూతు పురాణము గాదిది
పాత పురాణమును గాదు పాతకహరమౌ
సూతపురాణం బియ్యది
పూత పురాణంబు పుణ్య పురుషావళికిన్

రాముడు ఆర్యుడు. రావణుడు ద్రావిడ బ్రాహ్మణుడు. శూర్పణఖ రాక్షసి అంటే ద్రావిడ స్త్రీ. ఇదంతా కాదంటే ఎలాగ?

**మధుర:** రాముడు ధర్మప్రభువు. శూర్పణఖకు ముక్కూ, చెవులు కత్తిరించారంటే అటువంటి నేరాలకు అలాటి శిక్షలుండేవి ఆకాలంలో. మీరు ఇంగ్లండు వెళ్ళొచ్చి ఆ దృష్టితో మాట్లాడ్డం తప్పుకాదా? మీకు వెనక దృష్టి లేదు.

**త్రిపుర:** నేనెవర్నో తెలుసా? రాముడికి స్వామిని. అంటే రాముడికి మొగుడ్ని ఏమను కుంటున్నావో?

**మధుర :** 'స్వామి' అనేది గౌరవ విశేషణమే తప్ప అక్కడ షష్ఠీ తత్పురుష లేదు. అనగా తత్-ఆ యొక్క-రామునికి (పైన) స్వామి అనదగువారు లేరు.

**త్రిపుర:** అది కాకున్నచో; 'రామస్వామి' యనునదా ప్రజా 'స్వామిక'ము!

**మధుర:** ప్రజాస్వామిక సూత్రాలు ఆనాడు లేవు స్వామీ. మనుషులంతా సమానం అని ఎవరున్నారు? చాతుర్వర్ణాలూ ఒకటి కాదు. శూద్రుడు తపస్సు చేయడం తప్పని మరణదండన విధించారంటే - శూద్రుడు చెయ్యవలసిన విధ్యుక్త ధర్మం ఎవరు చేస్తారు? అనే కదా?

**త్రిపుర:** అయితే శ్రీరాముడు శంబూకుడ్ని వధించటం రైటంటావు?

**మధుర:** రైటూ, రాంగూ అంటూ మాట్లాడుతున్నారు మీరు ఇంగ్లండులో చదివివచ్చి. రామాయణ కాలం త్రేతాయుగం. అంటే కొన్ని లక్షల సంవత్సరాల క్రితం లేదా వందల, వేల సంవత్సరాల క్రితం రాజనీతి, పరిపాలనాక్రమం అలా వున్నాయన్నమాట.

**త్రిపుర:** చెట్టు చాటునుంచి వాలిని చంపడం సబబేనంటావు. అలా అలా 'సీతకు అగ్నిపరీక్షారైటే. ఆవిడ్ని అనుమానించి అడవికి తోలెయ్యడం రైటే. శంబుకుడ్ని చంపడమూ రైటే' - అంటావు గావును. అయితే యిక నీతో వాదించడానికి ఏముంది?

**మధుర:** చౌదరిగారూ అలా హీటెక్కిపోగూడదు. ఆనాటి పరిస్థితులు, దండనీతి, న్యాయం అలావుండేవి. దట్ వజ్ ద ఆర్డర్ ఆఫ్ ద డే అంతే. కాని మీరనుకున్నట్లు ఆల్ మెన్ ఆర్ ఈక్వల్ అన్నట్లు వుండేవి కావు. రాముడ్ని రాజుగా చూడకుండా మీరు కూడా దేవుళ్ళా చూసి కంగుతిన్నారు. అది వక్రంగా వున్నా అన్యాయంగా కనిపించినా అది అంతే.

**త్రిపుర:** నువ్వు నన్ను కన్‌ఫ్యూజ్ చేస్తున్నావు.

**మధుర:** అంత దేశాభిమానం, దేశభక్తి వున్నవారు. మీరు జస్టిస్ పార్టీలోకి ఎందుకు దూకారు.

**త్రిపుర:** ఈ బ్రాహ్మల డామినేషన్‌ను ఎదుర్కొనడం, వాళ్ళ హ్యుమిలియేషన్‌ను ప్రతిఘటించడం ప్రధాన సమస్య అయింది అప్పట్లో.

**మధుర:** బ్రాహ్మల డామినేషన్ సంగతి నిజమే కాని తెల్లవాళ్లు ఆ బ్రాహ్మణ భూతాన్ని చూపించి జస్టిస్ పార్టీలోకి మీ బోట్లని చేరదీసి, స్వాతంత్రోద్యమాన్ని నీళ్ళుకార్పించాలని చూశారు. అన్ని జాతులూ కలవకుండా విభజించి పాలించు అన్న ఆంగ్లేయ నీతికి మీరు లొంగి పోయారు. అవునా?

**త్రిపుర:** అది మా ఆత్మగౌరవానికి సంబంధించిన ఉద్యమం కనుక జస్టిస్ పార్టీలో చేరా. జస్టిస్ పార్టీవాళ్లు మాంటేఫర్డ్ సంస్కరణల విధానాన్ని సమర్థిస్తే నేను వాళ్ళతో కలవలేదు; పైగా వ్యతిరేకించా. జాతీయవాదుల డిమాండ్లను అంటే అధికారం జాతీయ వాదులకి రావాలనేవాదాన్ని సమర్థించా.

**మధుర:** అబ్రాహ్మణ జాతీయవాదుల సమావేశానికి విజయవాడలో 1917-18లలో అధ్యక్షత వహించారట గదా? అంటే బ్రాహ్మణులతో కలసి స్వాతంత్ర్యం పంచుకోవడానికి యిష్టం లేదన్నమాటా?

**త్రిపుర :** అప్పటి వ్యవహారాలని యిప్పుడు యీ దృక్పథంతో చూస్తేఅవకతవకగా కనిపించవచ్చు. నువ్విందాక ఆర్డరాఫ్ దడే అన్నట్టు. అప్పట్లో బ్రాహ్మణేతరోద్యమం అనేది ఓటి ప్రబలంగా వుంది. దాన్ని ఒప్పుకోవాలి. దాన్ని నేను సపోర్టు చేశాను; ఆత్మగౌరవానికి సంబంధించిన ఉద్యమం గనుక. తరవాత జాతీయోద్యమం వచ్చింది. దాంట్లో కూడా స్వపరిపాలనకోసం జస్టిస్ పార్టీని వ్యతిరేకించా. ఇదీ ఆనాటి పరిస్థితి.

**మధుర:** మీలో కొందరు - మీరు కాదనుకొండి - స్వాతంత్ర్యం వస్తే మళ్ళీ పరిపాలన బ్రాహ్మణా ధిక్యతలోకి పోతుంది; బ్రాహ్మణులక్రింద పనిచేయడంకంటె బ్రిటిష్‌వాళ్ళ క్రిందే పనిచేయడం మంచిది అని స్వాతంత్రోద్యమాన్నే చులకనగా చూశారుగా!

**త్రిపుర:** లేదు. ఆరోజుల్లోనే మేం స్వకుల పౌరోహిత్యం ఆరంభించాం. జంధ్యాలు వేసుకుని సంధ్యావందనం చేశాం. బ్రాహ్మలకన్నా నిష్ఠగా మేమూ వున్నాం. నేను పెద్దరికం వహించి ఎన్నో పెళ్ళిళ్ళు చేయించాను.

**మధుర:** అయ్యో! పిచ్చి చౌదరిగారూ, బ్రాహ్మణత్వాన్ని వద్దంటూ బ్రాహ్మణ ఆచారాల్నీ, పద్ధతుల్నీ మీరు అనుసరించడం వలన బ్రాహ్మణుల గొప్పదనాన్ని మీరు ఒప్పుకున్నట్లు కాలేదా?

**త్రిపుర:** అలా చూడకూడదు. సాంస్కృతికంగాను, విద్యాపరంగాను, నియమ నిష్ఠల్లోను ఎవరికీ తీసిపోము అని రుజువు చేశాము. నీవన్నట్లు వెక్కిరించాలనుకుంటే వెక్కిరించవచ్చు. నా విరోధం బ్రాహ్మణత్వంతోనే కాని బ్రాహ్మణులతో కాదు.

**మధుర:** ఇది తప్పించుకునేవాళ్ళు చెప్పేమాట. బ్రాహ్మడు లేకుండా బ్రాహ్మణత్వం అని వేరే వుంటుందా? (నవ్వు).

**త్రిపుర:** అందుకే తరువాత నాస్తికుడ్నయ్యాను.

**మధుర:** ఇహ మీరు నాస్తికులయితే మీ పోరాటం అంతా పోయినట్లే - దేవుడ్ని అంగీకరించిన వారికి పురాణాలతో ఏం పని? పైగా ప్రపంచమంతటా వున్న పురాణ సంస్కృతిని మీరు బ్రాహ్మణాధిక్యత నెపంతో ఎలా తిరస్కరించగలరు?

**త్రిపుర:** మన పురాణాలన్నీ బ్రాహ్మణాధిక్యతతో రాసిన పుక్కిటి గాథలంటున్నాను.

**మధుర:** మీరు ఏవన్నా మీ సంస్కారం వ్యక్తిత్వం యీ శతాబ్దానిది. పురాణ కాలాన్ని కొలవడానికి మంచి చెడ్డలు నిర్ణయించడానికి అది బొత్తిగా పనికిరాదు. వేల వందల సంవత్సరాల క్రితం చరిత్రను మీరెలా నిర్దేశిస్తారు? మీదంతా డబాయింపు సెక్షను. లేకపోతే తిట్టడం దేనికిట? శేషం కోపేన పూరయేత్.

**త్రిపుర:** అన్యాయంగా మాట్లాడుతున్నావు. నా వ్యక్తిగత కక్షతో నేనిదంతా తిరిగి వ్రాయలేదు. ఇది యిలాకూడా జరిగి వుండవచ్చునన్న అభిప్రాయంతో నమ్మకంతోనే వ్రాశా. మొండిగా నమ్మా.

**మధుర:** సెటైర్‌గా మీరేం చెప్పినా పవర్‌ఫుల్ గా వుంటుంది. కాని మీరు చెప్పిందంతా మీరూ నమ్మేసరికి చౌదరిగారింత అమాయకులా అని జాలి వేస్తుంది స్వామీ.

**త్రిపుర:** మలమల మాడు పొట్ట తెగ మాసిన బట్ట కలంత వెట్టగా
విలవిల యేడ్పుచున్న నిరుపేదకు జాలిని జూపకుండను
త్తలిపడి పోయి జీవరహితం బగు బొమ్మకు నిండ్లు వాకిళుల్
పొలమును బొట్టనిచ్చెడి ప్రబుద్ధ వదాన్యులు నిచ్చమెచ్చెదన్ -

**త్రిపురనేని రామస్వామి చౌదరి**

అనిన్నీ ''ఏడో, పద్నాలుగో, మూడో, ఎన్నో జగముల సృష్టించు యీశుడొకడో, యిర్వురో'' మరెంత మందో వారిని కనుగొనలేక, ''భక్తకోటికి ప్రాణాలపైకి'' వచ్చినదనియు, ''ఇందుగల డందులేడని సందేహము'' లేనివానికి, ''ఇందుగల డిందుగలడని తీర్థయాత్రలు చేయుట ''భాగవదపచారములు గావె పరమ పురుష'' అనియు ''గుడికి తరచుబోయి గొణుగుచుండెడి వాడు చెడ్డ పాపమేదొ చేసియుండు'' ననీ నామతం!

**మధుర:** ఇస్లాములో మీవంటి హేతువాద సూర్యుడు ఉదయిస్తే యిట్టే ఆర్పేసేవారు హోయ్ అల్లాఅంటూ.

**త్రిపుర:** అందుకే వాళ్ళింకా అట్లా వున్నారు వెనకబడి.

**మధుర:** అబ్రాహ్మణ ఉద్యమాలు ఆత్మగౌరవం ఉద్యమాలు వీట్లన్నిటిలో పనిచేస్తూ కూడా మీరు ఒక్కకులం అభ్యున్నతి కోసమే పాటుపడ్డారని మీమీదో అపవాదు వుంది. దానికి మీరేమంటారు?

**త్రిపుర:** నాకులం మటుకు దేశంలో భాగం కాదా - అది అలానే మొదలయింది. ఎక్కడ పుండు వుందో అక్కడ కడిగి కట్టువేసి మందేస్తారు. మొదట్లో సంఘసంస్కరణ, విద్యాభివృద్ధి, ఆత్మగౌరవం యివన్నీ బ్రాహ్మణత్వ అహంకారానికి ప్రతిగా వచ్చినవే. తప్పులేదంటాను. ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్‌లోంచి వచ్చినవే.

**మధుర:** తప్పొ రైటా అని కాదు గురువుగారూ. అవి మీ ఇమేజిని క్రుంగదీశాయి. మీరు జాతీయ నాయకులుగా జాతినంతా రిప్రజెంటు చెయ్యలేదు. కులరహితంగా పోవాల్సింది అబ్రాహ్మణ ఉద్యమంలో కూరుకుపోయారు నిలువునా.

**త్రిపుర:** నువ్వు ఎన్నిమార్లు దెప్పినా ఒక్కటే సమాధానం. అప్పటి పరిస్థితులు అలా లాగేశాయి నన్ను.

**మధుర:** జస్టిస్ పార్టీలోని మీవారు కాంగ్రెసులోని మీవారికోసం తాపత్రయం పడ్డారు.

**త్రిపుర:** స్వకులాభ్యున్నతి ద్వారా సాంఘిక సంస్కరణ సాధించటం యిప్పుడు నింద్యమే; అప్పుడు తప్పుకాదు. నేను జాతీయోద్యమంలో నా ఉత్సాహాన్ని చంపుకోకుండా జస్టిస్ పార్టీలో మావాళ్ళకు ఆశీస్సులందచేసిన మాట నిజమే. రెండు పడవల మీద ప్రయాణం చెయ్యలేదు.

**మధుర:** ఇన్నయ్యకి ఆచార్య రంగాగారు వ్రాసిన ఉత్తరంలో మీరు కులపిచ్చిలో కూరుకుపోలేదనీ, 'వీరగంధం తెచ్చినారము వీరులెవ్వరో తెల్పుడీ' అన్న పాట ఒక్కటి చాలు జాతీయ నాయకులలో మిమ్మల్ని ముందుసీటున నిలపడానికి అన్నారు తెలుసా?

**త్రిపుర:** ఏ రంగయ్యా నాకు యోగ్యతాపత్రం యివ్వక్కర్లేదు. నేను నేనే. నామంచి చెడ్డలు అన్నీ నావే. నా పురాణవైరం అంతా సనాతనాచారాల ఊబిలోంచి మనవాళ్ళను పైకిలాగడానికే. తెలిసే చేశాను.

**మధుర:** ఐరిష్ దేశభక్తుడు డీవెల్రా మీ ఫ్రండట గదా!

**త్రిపుర:** అవును, రంగయ్య నాసాయం అడిగాడు. 'కమ్మపత్రిక'ను రైతు పత్రికగా మార్చాం ఎందుకంటే - కమ్మ వారితో పాటు రెడ్లు, తెలగాలు, రాజులు, కొందరు పంచములుకూడా రైతుల్లో వుండేవారు - రైతాంగం సమస్యలనూ ప్రభుత్వ పీడననూ బ్రిటిష్ సర్కారు దృష్టికి తేవడానికి ఈ పత్రిక ఉపయోగపడింది. దానికి నేనే ఎడిటర్ని.

**మధుర:** కమ్మవారిని యితర కులాలతో చేర్చి జాతీయ ముఖ్యస్రవంతిలో కలపడానికి చేసిన ప్రయత్నాల్ని మీవాళ్ళు అడ్డుకోలేదా?

**త్రిపుర:** అది సహజం. అడ్డుకుంటే నేనువారిని ఎదిరించి తేగేసి చెప్పాను: అందరం కలిశాక ముందునకు పోదాం అని. రైతుపత్రిక్కి రంగయ్య ఇంగ్లీషు లేబర్ గురించి, సామ్యవాద భావాలగురించి అక్కడి పరిస్థితుల గురించి; వ్రాసేవాడు. రంగయ్యకి కమ్మవారితో పేచీలొస్తే నేను అడ్డుపడేవాడ్ని.

**మధుర:** సెంట్రలు గవర్నమెంటు వారు మా గురజాడ అప్పారావుగారికి పోస్టలు స్టాంపు వెయ్యలేదుకాని మీకు వేశారు. (నవ్వి) ఆ గౌరవం మీకు దక్కింది.

**త్రిపుర:** (ముసి ముసి నవ్వులు నవ్వుతాడు.)

**మధుర:** మీ లక్షణాలన్నీ ప్రతి తెలుగువాడిలోనూ వున్నాయి. మీరు నూటికి నూరుపాళ్ళు తెలుగుబిడ్డ. అయినా మిమ్మల్ని ద్వేషించడం తేలిక, ప్రేమించడం కష్టం (నవ్వు).

* * *

(సూతాశ్రమంలో రామస్వామి చౌదరి గారు సిగరెట్ దర్జాగా పీలుస్తూ ఉంటారు)

**త్రిపుర:** పాయక పూర్వగాథలని ప్రత్నకవీంద్రులు నేటి దాక రా
మాయణ భారతాది కృతులన్నియు వ్రాసిరి త్రిప్పి త్రిప్పియే
దోయొక కబ్బ మంచుఁదలకొక్కటి యక్కట నూతనాంశమేదో
యొకటేనియుం దెలుపనోపని గ్రంథ సమూహమేటికో.

**మధుర:** నూతనాంశాలని మీరనుకున్న వాటిని మీకు వదిలేశారేమో! (నవ్వు)

**త్రిపుర:** నేడు హైందవమున వేదములు వైదొలగినవి. ఉపనిషత్తులు తపతపలాడుచున్నవి. స్మృతులు శిరసుపైకి, పురాణములు బుజములపైకి, ఆచారములర్రు పైకి ఎక్కి హిందువుల నణగు ద్రొక్కుచున్నవి. ఈ పైశాచిక శాసనములో కులవైషమ్య మొకటి. ఇది కావ్యజగత్తులోకి కూడ ప్రాకినది. కట కటా!

**మధుర:** వేశ్యలు సంస్కృతం చదువుకోవచ్చు నన్నారే - ఇంకెవరికీ పర్మిషను లేదు.

**త్రిపుర:** అప్పకవి శూద్రుల రచనలను గూర్చి - పాయసమైనను మృష్టాన్నమైనను సంస్కార పక్వముగానిచో హవ్యమునకు పనికి రాదన్నాడు.

**మధుర:** అందుకే పాపం చిన్నయ సూరిగారిని ''చిత్, నయ, సూరి'' అన్నారు. అంటే జ్ఞానమును దొంగిలించుటలో సమర్థుడు అని వేళాకోళం చేశారు. పాపం, తరగతిలో

శూద్రులు కూర్చుంటేవే వారిని చూడకుండా వారివైపు వీపు తిప్పి పాఠం చెప్పే వారట పండితులు. గిడుగు రామ్మూర్తి పంతులు గారు తాపీ పాఠం చెప్పే వారట - వ్యావహారిక భాషను వ్యతిరేకిస్తున్నాడని.

**త్రిపుర:** సూతుడు శౌనకాది మహామునులకు చెప్పినట్లు దేవావైశంపాయనుడు జనమే జయునికిట్లనియె అన్నారు భారతంలో. కాని-

నా పేరన్ వెలయించి నా మెడకు నంటం గట్టి తద్గ్రంథముల్
నాపై నేరము మోపహా దలఁచి యన్యాయంబు న్యాయంబుగా
బాపంబు న్సుకృతంబుగాగ రచియింపంజాలినారెవ్వరో
నాపై బెట్టిన యట్టి యాయగడు మాన్పంగా బ్రయత్నించెదన్.

అని సూతుడు నాతో గోలపెడితే నేను సూతపురాణం, భగవద్గీత తిరిగి రాయాల్సి వచ్చింది, ద్రావిడులు ఆర్యుల పోరాటాలు దృష్టిలో వుంచుకుని.

**మధుర:** కౌరవులదే రాజ్యం పాండవులకు హక్కులేదని వాదించారట గదా మీరు?

**త్రిపుర:** అందుకోసం కురుక్షేత్ర సంగ్రామం వ్రాశాను. నాతో పెండ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు కూడా కలిశారు.

**మధుర:** ఇదంతా మీ ఆంగ్లవిద్యా ప్రభావంవలన పురాణాలను గుడ్డిగా నమ్మక స్వతంత్రంగా చేసిన ఆలోచనల ఫలితం. మీరు రాజ్యాధికారం కౌరవులదేనని వ్రాశారు. కాని మూలంలో స్పష్టంగా ధృతరాష్ట్రుడు అంధుడగుట చేత రాజుకాలేదనీ, పాండురాజే రాజయ్యాడనీ వుంది. కాని పాపం పాండురాజుకి వున్న జ్యేష్ఠభ్రాతృ గౌరవం చేత అతనికి పెద్దరికం యివ్వడం చేతనూ, తమ నిరంతరం దిగ్విజయాలతో రాజధాని లేకపోవడం చేతనూ, ధృతరాష్ట్రుడు స్థాన బలిమిచేత వచ్చిన అధికారాన్ని నిలుపుకొని, ధర్మరాజుకి పూర్తి రాజ్యం ఇవ్వాల్సి వుండగా, కొంత రాజ్యం మాత్రం యిచ్చి, దుర్యోధనుడికి ప్రధానమైన హస్తినాపురం సంక్రమించేట్లు ఏర్పాట్లుచేశాడు. అంచేత కౌరవులదే అన్యాయం; పాండవులది కాదు స్వామీ!

**త్రిపుర:** పంచమ వేదానికి నేను పట్టించిన దుర్గతికి నన్ను మతద్రోహి అన్నారు. ఆ రోజుల్లో తిరుపతి వేంకట కవుల పాండవ నాటకాలు వీర విహారం చేసేవి. కౌరవులు అధర్మపరులని ధర్మరాజు ధర్మపక్షం అవలంబించి శ్రీ కృష్ణుని సాయంతో ధర్మప్రతిష్ఠాపన చేశాడనే విశ్వాసం ప్రగాఢంగా వుంది. అప్పుడే నాకు భారత కథలోని అంతరతత్వం పై అనుమానాలు కలిగాయి. హేతువాద దృక్పథంతో భారతం క్షుణ్ణంగా చదివా. నా కురుక్షేత్ర సంగ్రామం రెండవ అంకంలో సంజయపాత్ర ముఖంగా కురుసామ్రాజ్యాధిపత్యం ధృతరాష్ట్రుని యందే కాని పాండురాజుకు లేదని హేతుబద్ధంగా చెప్పాను. మేము చేయని పని నీవు చేసినావు అని చెళ్ళపిళ్ళవారు కూడా అన్నారు మెచ్చుకుంటూ.

**మధుర:** అయితే పాత పురాణాలను ఇతిహాసాలను మీరు తూర్పార పట్టడం సంఘ శ్రేయస్సు ఎలా అవుతుంది?

**త్రిపుర:** మానవ సంఘం బాగుపడాలంటే కాలాన్ని బట్టి క్రొత్త నిర్మాణాన్ని సాగిస్తూ వుండాలి. కాని అంతవరకూ సంఘంలో వున్న కట్టుబాట్లు దీన్ని సాగనివ్వవు. కాబట్టి వాటిని త్రెంచాలంటే కురుక్షేత్ర సంగ్రామంతో మొదలెట్టాలి.

**మధుర:** డి.యల్. రాయ్ నాటకాల్లో శంబుకవధ గురించిన నాటకం కూడా వుందిట గదా!

**త్రిపుర:** అయితే సామాన్యులకు తెలియదు.

**మధుర:** మీరే శంబుకులు. కాని శంబుక వధ శ్రీరామునిది. అప్పటి వ్యవస్థ అలా వుండేది. ఎందుకు వుండేది అని ప్రశ్నించడం వేరే విషయం. నేరాలు ఎలాంటివైనా దండన నేటి పాకిస్తాన్‌లో వలె వుండేది?

**త్రిపుర:** ''రాజా రాష్ట్రకృతం పాపం రాజపాపం పురోహితః'' అన్నట్లు ఆ పాపం వసిష్ఠుడి మీద పడింది.

**మధుర:** చౌదరిగారు రామాయణంలో ఆర్య ద్రావిడ సంఘర్షణను తెచ్చిపెట్టారు. రాక్షసులు ద్రావిడులనడానికి ఆధారాలేమిటి?

**త్రిపుర:** ఆర్యజాతి ద్రవిడ జాతిని ఓడించి అసురులనీ, దస్యులనీ పిలిచి, వారిని దుర్మార్గులుగా నిరూపించి, జయించి, బానిసలుగా జేసికొని శూద్రులుగా వ్యవహరించి వారికేహక్కులు లేకుండా చేశారు. పురాణాలు స్మృతులు యీ భిన్నజాతుల కొరకు ఏర్పరచిన శాసనాలే. కనుక యవి ప్రమాణాలు కావు. పాశ్చాత్య పండితులు ఆర్యులు పైనించి వచ్చారనీ ద్రావిడులు యిక్కడి వారేననీ నిర్ధారణ చేశారు.

**మధుర:** రాక్షసులు ద్రావిడులు అనడానికి ఆధారాలు లేవుట. అసలు ఆర్యులు ఎక్కడ నుంచి వచ్చారో యింకా తేలలేదు. ద్రావిడులు కూడా యిక్కడి వారు కాదని కొందరంటే, ఆర్యులూ ద్రావిడులూ రెండు విభిన్న జాతులవారు కారనీ రెండు భాషలు మాట్లాడే ఒకే జాతి వారనీ కొందరంటున్నారు. కనుక జన్మతః దాక్షిణాత్యులైన ద్రావిడులను విదేశీయులైన ఆర్యులు ఆక్రమించారన్న కవిరాజు గారి ఊహ సరైనది కాదు. పైగా రాముడు మీకు అర్థం కానంత మాత్రాన రాక్షసులు అంతా మంచివాళ్ళు ఎట్లా అవుతారు?

**త్రిపుర:** నా శిల్పం అంతా ఆర్య ద్రావిడ సంఘర్షణ మీద పూర్తిగా ఆధారపడివుంది. అది రామాయణమైనా, శంబుక వధ అయినా మరోటీ అయినా-

**మధుర:** రామస్వామి నాయకర్ ప్రభావం మీమీదేమైనా వుందా?

**త్రిపుర:** రామాయణం నేనూహించినట్లు నేన్చెప్పినట్లే జరిగి వుంటుంది.

**మధుర:** ఆర్యుల సంస్కృతి విజ్ఞానం మనకు బాగా తెలుసు. మీరు మంచివారంటున్న రాక్షసుల గురించి వారి మంచితనం గురించీ మనకేమీ తెలీదే? తాటకిని శూర్పణఖను మీరూ నార్లగారూ మెచ్చుకున్నార్ల!

**త్రిపుర:** మనవాళ్ళు పవిత్రంగా భావిస్తున్నవన్నీ ఎలా దోష భూయిష్ఠాలో చెప్పాను. స్త్రీ

పురుషులు శాస్త్ర దాస్యం నుంచి, భావదాస్యం నుంచి విముక్తులైతే వారికి యింక నేనేమీ చెప్పక్కర్లేదు.

**మధుర:** ఏది ఏమైనా మొత్తానికి మీరు తెలుగువాళ్ళ మూతికి బిగించిన తాళాన్ని తీశారు. మిమ్మల్ని భావ విప్లవకారుడు అనకపోతే చాలా ప్రమాదం.

**త్రిపుర:** ఏం ప్రమాదం?

**మధుర:** మీరు అదిగాకపోతే ఇంకేమిటి? ఏమీ కాకుండా ఎలాపోతారు?

**త్రిపుర:** పదహారణాల తెలుగు బిడ్డను.
కంచి కోటల కంచు తల్పులు
ఖంగు ఖంగున మ్రోగునప్పుడు
తంజనగరపు కోట గోడలు
చెంగు చెంగున ఎగురునప్పుడు
తిరువటంబునఁ జేరసేనలు
కెవ్వు కెవ్వున నరచునప్పుడు
మధురకోట యగడ్తలన్నియు
రివ్వు రివ్వున దూకునప్పుడు
తెలుగు వారలు పిరికి వారలా
తెలుగు బిడ్డా! తెలిసికొనుమా!

**మధుర** : 'మందే రా' ఒక మాటు పాడండి నా కోసం!

**త్రిపుర:** బ్రహ్మపురము మందేరా పర్లాకిమిడి మందేరా
కాదని వాదుకు వస్తే కటకం దాకా మన్దేరా!
బస్తరెల్ల మందేరా జయపూరంతా మందేరా
కాదని వాదుకు వస్తే నాగపూర్ దాకా మందేరా!
గోలుకొండ మందేరా తెలంగాన మందేరా
కాదని వాదుకు వస్తే నైజామంతా మందేరా!
చెన్నపురము మందేరా చెంగల్ పట్టు మందేరా
కాదని వాదుకు వస్తే తంజావూరును మందేరా!
బెంగుళూరు మందేరా బళ్ళారీ మ్మందేరా
కాదని వాదుకు వస్తే కన్నడ మర్థం మందేరా!
దేవికోట మందేరా పుదుక్కోట మందేరా
కాదని వాదుకు వస్తే కాండీ దాకా మందేరా!

**మధుర:** చబాష్! మీరు పది కాలాలపాటు చల్లగా వుండాలి. మీ తెలుగు పౌరుషానికి తెలుగు అభిమానానికి హద్దులు లేవు. హిందీ అంటే పడదుగా - సంస్కృతం అంటే కూడా మీకు పడదా?

**త్రిపుర:** సంస్కృతము దేవభాషయని నిన్న మొన్నటి వరకు ద్విజులే చదువవలెననిరి.

మనలను దాస్యమునందుంచెడు భాష మనకెందులకు? మనము తెలుగు వారము. తెలుగు మనకు తల్లిభాష. తెనుగు తేట అని ప్రశంసించు వారు తెనుగునుడి కారముతో వ్రాయరేమి?

**మధుర:** మీరు వక్త కారు. పద్యం బాగా చదవలేరుట. సోక్రటీసులాగ డైలాగ్స్ బాగా చెప్తారట. నిజమా?

**గిరీశం:** (ప్రవేశించి) నిండు మనమ్ము నవ్య నవనీత సమానము పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము. గురువుగారు పెడసరంగా మాట్లాడినా వారి డైలాగ్స్ చమత్కారాలూ మిరియాలూ. నేన్చెబుతాను విను.''మోడ్రన్ కవులంటే వారికి చిరాకు'' 'ధర్మం కృతయుగంలో నాలుగుపాదాలు నడిచింది' అన్నారెవరో. 'ఆ కాలంలో అందరూ పశుప్రాయులన్న మాట' అని వెంటనే మాటకు మాట జవాబిచ్చారు గురూజీ. ఒకరు రామకోటి వ్రాసి వారిని మెప్పించుటకు వచ్చారు. ''యిన్ని సంవత్సరాల నుండి వ్రాస్తున్నా రెండక్షరాలు సరిగా వ్రాయలేక పోయావు'' అన్నారు చటుక్కున. అంగలకుదురులో ఒక ఉపన్యాస చక్రవర్తి కవిరాజు గారిని ''మీరు మ్లేచ్ఛులు గదా. నేను స్వచ్ఛమైన బ్రాహ్మణున్ని'' అన్నారట. కవిరాజు ''మీరు మనుస్మృతిని అంగీకరిస్తారు గదా'' అని అడగ్గా ''తప్పకుండా'' అన్నాడట ఆ బ్రామిన్. ''వింధ్య అవతల ప్రదేశమంతా మ్లేచ్ఛ దేశమని మనుస్మృతి చెప్తున్నది'' అనగా అంతా గొల్లుమన్నార్ట సడెన్గా. పర్వతనేని వీరయ్యచౌదరిగారు తమస్వగ్రామం అయిన పెదనందిపాడులో కవిరాజుగారితో షికారుకని వెళ్ళి అక్కడొక డొంకలో కూర్చున్నారు. ఆ డొంకలు చాలా విశాలంగా వున్నాయి. ఆ డొంకలను చూపిస్తూ ''ఇంత విశాలమైన డొంకలు ఎక్కడా లేవు'' అనగానే చౌదరిగారు తడుము కోకుండా ''అవును పనికి మాలిన భూములైనపుడు డొంకలు లేకేమవుతాయి. సహారా ఎడారిని చూసి మెచ్చుకున్నట్లుంది నీమెచ్చికోలు'' అని వారిని కంగు తినిపించారుట మా గురువు.

**మధుర:** చాలా సంఘటనలను గుర్తుచేసి నవ్వించారు గిరీశం గారూ-చౌదరిగారి జీవితానికి మూల సూత్రం ఏది?

**గిరీశం:** హేతువాదతత్వం. సత్యాన్వేషణ. వివేచనాశక్తిని మానవ వ్యవహారాలకు సమస్యకు అన్వయింప జేయటమే హేతువాదం అన్నాడు యం.యన్.రాయ్.మరొక్క మాట-రామస్వామి గారు బాల్యంలో చేతబడి చేసిన చెట్లెక్కి పలుదోము పుల్లకోసికొని అక్కడి డబ్బుల్ని జేబులో వేసుకుని మంత్రించిన బొత్తాన్ని యింటికి తెచ్చేవారట. అలాగే విదేశాల్లో 13వ నెంబరు గదిలో వుండే వారట.

**మధుర:** హిందూస్థానీ కర్ణాటక సంగీతంలోని భేదాలు, సైగాల్ మ్యూజిక్కు, న్యూథియేటర్స్ సినిమాలు, హిందీ వ్యతిరేకోద్యమం యివన్నీ మీకిష్టమైనవే.

గుదురని జంకు చూపు గమి గూపులు గల్గియు నామనస్సులో
మెదలుచు నుండెఁగా ప్రతి నిమేషము మత్కులకాంత నేటికిన్.

**త్రిపుర:** పున్నమ్మ మహాసాధ్వి. ప్రసవంలో గతించింది. మహాభక్తురాలు; నిరంతరం పూజలు చేస్తూ వుండేది.

**మధుర:** ఈమె గోపీచంద్‌గారి తల్లా?

**త్రిపుర:** అవును. అట్లూరి వారికి మా త్రిపురనేని వారికి చాలాకాలంగా బంధుత్వం వుంది. మా అత్తారివూరు అంగలూరికి దగ్గరగా వున్న చౌటపల్లె. ఆమెకు అయిదవ ఏడు. నాకు పదేళ్ళు. నేను 1914లో ఇంగ్లండు వెళ్ళేటప్పుడు వాళ్ళను అంగలూరులో దించి వెళ్ళా.

**మధుర:** బ్రాహ్మణులలో కొంతమంది మాంసాహారులవుతున్న యీ కాలంలో మీరు పూర్తి శాకాహారులు కావటం ఆశ్చర్యకరమే.

**త్రిపుర:** జీవహింస చేసి జీవింతుననుకంటెఁ:
జెట్ట యెందుఁగూడఁబుట్టఁబోదు
జీవహింస మాని జీవింపరాదొకో...

**మధుర:** మీరు శాకాహారులు కావడం కంటె కూడా మరో గొప్ప సంగతి మీరు తెనాలి ఛైర్మన్‌గా వున్నపుడు మారెమ్మ తెనాలి మీద విరుచుకుపడినపుడు జాతర్లకి బలులకి మీరు ముక్తిచీటీ యివ్వలేదట గదా! విశ్వాస రాహిత్య తీర్మానం తెచ్చినా మీరు ఆదర్శభ్రష్టులు కాలేదు. మీరు వాక్శూరులు కాదు. కార్యశూరులనిపించుకున్నారు. ధన్యులు.

**త్రిపుర:** మనసు నచ్చునెడల మన్నింపగా వచ్చు
మనసు నొచ్చు నెడల మానవచ్చు
గాని వివరమేమి కనకుండ వినకుండ
బరుల బ్రువ్వ దిట్ట ఫలము కలదె?

**మధుర:** బ్రాహ్మణత్వం సమాజ వికాసాన్ని సంపూర్ణంగా అరికట్టింది. వర్ణాశ్రమ ధర్మాలు ప్రతిష్ఠాపించింది. జాతి విభేదాలు రెచ్చగొట్టింది. బానిసత్వ దశను నిలప పాటుబడింది. జన్మకారణం గానే పూజలు పొందే హక్కులు కల్పించింది. ఇంతేనా మీరు చెప్పదలుచుకున్నది?

**రామస్వామి:** దక్షిణాఫ్రికా యందు నిర్దయులు తెల్ల
వారు భారతీయుల పెట్టు పాట్లు గాంచి
గొల్లుమని యేడ్చునెంతొ గగ్గోలు పడుచు
బనవుచుండును నీ నాటి బ్రాహ్మణుండు.

కులాభిమానముతో నందఱ కంటె తానెక్కువయని బ్రాహ్మణుడనుకొనుచున్నట్లే, కొందరి కంటె తానెక్కువయని యీ యభిమానము గలవాడను కొనుచున్నాడు.

**మధుర:** సరే-ఐతే నన్నయ ఆదికవి కాడంటారా చౌదరిగారూ?
జోలపాటలు నేర్చి యేలపాటలు చేర్చి
ప్రోడపిల్లయై పాతర లాడనేర్చి
తెలుగు కబ్బపుకన్నియ తెలివితోడ
ఇంతియే కాని నన్నయ వింతగాగ
పుణికి గంటము చేపట్టి కణతలదర
కైత పుట్టించె ననుమాట కల్లమాట

**మధుర:** ఇప్పుడు శూద్రవర్గం పైవర్గాల మీదకు విప్లవం చేసి అధికారాన్ని వశం చేసుకుంది. ఇక దళితవర్గం యీ శూద్రవర్గం మీద విప్లవం చేస్తున్నది అధికారాన్ని వశం చేసుకుందుకు.

**రామస్వామి:** (సిగరెట్ బాగా పీలుస్తూ) ఏమున్నది? బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రలందరి మీదా దళితులెక్కి పోతారు. ప్రతిభా గితిభా జాంతానై.

**మధుర:** జస్టిస్ పార్టీలో పెద్దలు మీకు కోరుకుంటే జడ్జీ పదవులిచ్చినా మీరు వద్దని పేదరికాన్నే వరించి నిజాయితీతో గడిపారు అని వున్నవ వారన్నారు. ఆ విలువలు లేనప్పుడు, మీ వాళ్ళిప్పుడు ఎలా జీవిస్తున్నారో చూస్తే వీళ్ళ కోసమా నేను పోరాడింది అని మీరు ఫీలవుతారు. నిరాడంబరులైన మిమ్ముల్ని ఆంధ్రదేశం చాలా అపార్థం చేసుకుంది. అందరి కోసం పాటుబడ్డా మీరు కొందరి మనిషే అనుకున్నారు. సారీ! చౌదరీగారూ! మన సంస్కృతి నించి మీరు తిరస్కరించిందే ఎక్కువ . స్వీకరించింది తక్కువ. ★

*('మిసిమి' ఫిబ్రవరి, మార్చి 1992)*

# గుడిపాటి వెంకటచలంతో



చలంగారు ఒక చినిగిన పాత చీరముక్క లుంగీగా చుట్టుకుని పైన ఒక గళ్ళ బుష్‌షర్టు వేసుకుంటారు. పిండి రుబ్బుతూ లేచి వచ్చినట్లున్నారు. గడ్డం మాసింది బాగా, జుట్టు రేగివుంది. ముఖం ఈశ్వర తేజస్సుతో వెలిగిపోతూ వుంది.

**మధుర:** నేనెవర్నో పోల్చుకోలేరా?

**చలం** (నవ్వి): నువ్వు ఎంకి పక్క నిల్చోతగ్గ దానవు. ఎంకివి కావు. మహాపతివ్రతవు కావు. ఊర్వశివో, వసంత సేనవో...

**మధుర:** గెయిషాని కాన్నేను. అప్పారావుగారి అందమైన పాపన్ని.

**చలం:** Colourless iniquity ఇంత లేటుగానా రావటం?

**మధుర:** శ్రీశ్రీని విశ్వనాథని వీళ్ళందర్నీ వదుల్చుకుని వచ్చేసరికి యింత ఆలస్యమయింది.

**చలం:** నీ దగ్గరకి వచ్చే వాడి కళ్ళు మూసుకుపోవటం వెళ్ళేవాడి కళ్ళు తెరుచుకోవటమూ సహజమే.

**మధుర:** సౌజన్యారావు పంతులు గారి ఆలోచనకు అందని సంగతులు మీరు ఆలోచిస్తారని.

**చలం:** సంస్కరించేటప్పుడు తప్ప సాంఘిక చట్టాల్ని మీరడం నేరమన్నారు అప్పారావుగారు. వివాహబంధాన్ని తృణప్రాయంగా మీరే వారందరూ సంఘపూజ్యులే. ఇట్లా మీరే సంసార బంధం వల్ల లాభమేమిటి?

**మధుర:** అలా మీరనవసరం లేకుండా మనుషులు దొంగలు కాకుండా సంస్కరించ మన్నందుకు మిమ్మల్ని సాంఘిక, వాఙ్మయ, నైతిక బహిష్కారానికి గురిచేశారు అవునా?

**చలం:** ఆయన అన్న మాటల్నే సరిగా నేను అన్నందుకు కోపం నా మీద. ఏదో ఉద్రేకంలో ఉపోద్ఘాతాలు నేనడక్కుండానే వ్రాసి పశ్చాత్తాప పడేవాళ్ళూ, నన్నిష్టపడే వాళ్ళ వద్దపొగిడి, ఇష్టంలేని వాళ్ళ వద్ద తిట్టే వాళ్ళూ, ''మనిషి ఫరవా లేదుగాని ఆ వ్రాతలు'' అనే వాళ్ళూ, ''వ్రాతలతో ఆగితే బాగా వుండును'' అనే వాళ్ళూ - - ఇట్లాంటి మిత్రులకన్నా పడ పడ దూషించే విరోధులెంత ఉపకారులు?

**మధుర:** మీరు ఆంధ్రా యూనివర్సిటీ నవలల పోటీకి వేయి పడగలు నారాయణరావుతో దీటుగా నవల పంపారట ఏవిటిది?

**చలం:** మైదానం. లూ యీ సిన్‌క్లర్ ఓసారి అన్నాడు. మర్యాదకీ ధనవంతుల పద్ధతికీ ఎదురు తిరిగి రాస్తే ప్రతిభకల రచయితని అమెరికాలో కొనేస్తారట! లొంగిపోతే వెలేసి అనామకుణ్ణి చేసి అతని గొంతు పిసికేస్తారు. నన్నా పనిచెయ్యలేకపోయారు యిక్కడ.

**మధుర:** మరి ఆర్టిస్టుకి పాప్యులారిటీ మీద ధ్యాస వుంటుంది కదా!

**చలం:** వాడు దేవుళ్ళాడేదే పాప్యులారిటీ కోసం. అతన్ని ఆర్టిస్టు కాకుండా చంపేదే ఆ పాప్యులారిటీ. మర్యాదస్తుడివైపో నీకు దాసుల మవుతాం అంటారు. ఏ టాగూరులాటి వాడో బెర్నార్డ్‌షాలాంటి వాడో లొంగరు వాళ్ళకు, లోకం కళని చిన్నతనంలోనే చంపేస్తుంది.

**మధుర:** ఎట్లా వచ్చాయి. ఎంకి పాటలు?

**చలం:** ఎట్లా వొచ్చాయో ఒచ్చాయి ఒక్క గుంపుగా ఆయన హృదయాన్నిచీల్చుకుని, మరోలోకపు హంసల వలె. ప్రతి వారిలో భయపడి దాక్కుని వున్న శృంగార రేఖలు మామూలు దుమ్మని చీల్చుకుని తలలెత్తి చూశాయి.

**మధుర:** ఏం చేశాయవి?

**చలం:** ఏం చేశాయా? దేశంలో యింత గాలి దుమారం రేపి, కవిత్వపు చెత్తనంతా వూడ్చి కడుపులు మండించాయి. మడి కట్టుకుని వంటింటో కూచుని తానే శుచి అని విర్రవీగే కవిత్వాన్ని జుట్టు పట్టుకుని తోటల్లోకి చేలల్లోకి లాగాయి.

**మధుర:** అప్పుడు ఎంకి ఏం చేసింది?

**చలం:** ఆగ్రహంతో శపిస్తామన్నారు పండితులు. నన్ను తీసుకుంటారా నడ్డి విరగొట్టనా అని బెదిరించింది. రసికులందరూ ఎంకి వెంటపడ్డారు. ప్రతి వారిలో భయపడి దాక్కుని వున్న శృంగార రేఖలు మామూలు దుమ్మని చీల్చుకుని తలెత్తిచూశాయి.

**మధుర:** కవిగారు ఏవంటారు?

**చలం:** ఎంకొక్క దేవతై ఎలిసెనంటారు. ధిక్కారంలోకి దిగి ఎంకి ఆధిక్యత నిలిపారు. ఈ లోపల కవి యెదిగారు, వయసులోనే కాదు, అనుభవంలో, మర్యాదలో, కీర్తిలో, మన్ననల్లో. '' ఎంకి అన్న అపవాదు, ఈనాటిదే కాదు ఎన్నటికి పోదు'' అని విలపించాడు కవి.

**మధుర:** ఎంకి మారిందా?

**చలం:** ఎంకిని తీర్థయాత్రలుకు పంపారు. గంగాస్నానం చేయించారు. విశ్వేశ్వరుడి తల తడిమించి, ఆశీర్వచన మిప్పించారు. కాని, నీ వాక్కు నిన్ను పట్టేస్తోంది. నీకోకులం వంశం లేవు అన్నారు. ఊర్వశి, హృదయేశ్వరి, కాంతం, కిన్నెరసాని, తెలుగుతల్లి పక్కన కూచోనియ్యలేదు ఎంకిని.

**మధుర:** అప్పుడు వూరుకున్నారా సుబ్బారావుగారు?

**చలం:** నా ఎంకిని మీ సహపంక్తిని కూచోనియ్యరా! సరే, నాకూతురికి కులాన్నిస్తాను. ఈమె శృంగార దేవత. ఈమె మహాప్రతివ్రత. అయినా సరే నీ వంశం నీ మాటా అని తోసేశారు కిందికి కవితాస్వర్గం నుంచి. కవిబ్రహ్మ మండి పడ్డాడు. నీకో లోకం సృష్టిస్తానన్నాడు. సృష్టికి ప్రతిసృష్టి జరిగింది. ఆ లోకానికి రాణి ఎంకి.

**మధుర:** ఎంకి మారిందా?

**చలం:** వాళ్ళు నిజంగా రాజా రాణీ అయ్యారు. పూర్వంమల్లే ఆడుకోవడమూ, వుత్తుత్త విరహాలు పడడమూ, చిన్నచిన్న శృంగార చేష్టలూ యిప్పుడు సిగ్గరి పనులయ్యాయి. ఆత్మల మన్నారు. ప్రియులమని మరిచి దేవత్వం పూనారు. ఇప్పుడు కావి రంగు మడిబట్టకట్టుకుని కాళ్ళు ఎత్తి ఎత్తివేస్తుంది. తోటల్లో పరుగులెత్తదు. నవ్వదు. గెంతదు. కళ్ళు ముయ్యదు.

**మధుర:** ఇదంతా సుబ్బారావుగారికి తెలుసా?

**చలం:** సుబ్బారావుగారు తెలుసుకోని దేమంటే, తాను పాట రాసినా, ప్రథమం నించి ఆ పాటకూ మామూలు శృంగారపు గీతం కాదు - వాటికి ఓ ఆత్మ వైశాల్యం, ఓ గంధర్వ విలాసం పట్టింది. అందువల్లే పల్లె పాటలకి లేని ఆధిక్యత ఎంకి పాటలకి పట్టింది. ఎంకి మొదటి నుంచీ యీ ప్రపంచాన్ని మించిన శృంగార వీధుల్లోనే విహరించింది. ఎంకి ప్రజల మనిషి కాదు. ప్రజల మన్ననలకి ఎన్నడూ ఆశించలేదు ఆమె. అసలు ట్రాజిడీ ఏమిటంటే ప్రజా వాఙ్మయం కింద ప్రజలు తీసుకోలేదు. సాహిత్యం కింద పండితులు తీసుకోలేదు.

**మధుర:** పోన్లెద్దురూ ' ఎంకెవ్వరని లోకమెపుడైన అడిగితే వెలుగు నీడల వేపు వేలు సూపింతు' అన్నారు కవి.

**చలం:** కవి మారినపుడల్లా పాత్రకి నగిషీలు చెక్కుతూ కూర్చుంటే కొన్ని ఎదురు తిరుగుతాయి. ఎంకికి Sophistication వస్తే యింకే ముంది? బారిష్టర్ పార్వతీశం ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అయినట్లు.

**మధుర:** పాత్ర రచయితని మించిపోతే వస్తుంది చిక్కు. దానికి ప్రత్యేక వ్యక్తిత్వం వస్తుంది. అల్లా వస్తే అది మీ చెప్పు చేతల్లో యిముడదు. నాకు మల్లే -

**చలం:** ఆ పాత్రను సృష్టించిన రచయితే చివరికి దానికి విరోధిగా మారతాడు పితృవాత్సల్యం చేత - అవి ఎదురు తిరుగుతాయి కూడా. కాంతం వృద్ధాప్యం రాసి మునిమాణిక్యం వారు ఆ తప్పే చేశారు.

**మధుర:** నాకు వయసుందా? అప్పుడెలా వున్నానో యిప్పుడూ అలానే వున్నా - మాకు డిప్రీసియేషన్ వుండదు. వుంటే అప్రేసియేషనే కాని. మాతో బాటు మమ్మల్ని సృష్టించిన మీరూ వుంటారు. మీరు గీత దాటితే-

**చలం:** కూతురి సౌరె గదిలోకి తొంగి చూసినట్టు.

**మధుర:** ఛీఛీ మాట మారుస్తా! మాలపిల్ల సినిమాలో గాంధీగారి మీద బసవరాజు గారి పాట వినిపించారు, గుర్తుందా?

**చలం:** గుర్తుండకేం? కోమటైబుట్టితేనేమీ, మా గాంధి మాలడై తిరిగితేనేమీ అని, ఏవిటా లేకి మ్మాటలు? అయినా గాంధీని అంగీకరిస్తామని వెధవ కండిషన్లు. కుల ప్రసక్తి తేవడం నీచాతినీచం కదా!

**మధుర:** మీరే అలా అనుకుంటే యిక నేనేమనాలి?

**చలం:** అప్పుడప్పుడు అనిపిస్తుంది - జీవితంలో విరామం లేని క్షోభనంతా యెందుకు తెచ్చి పెట్టుకున్నానా - అని. నన్ను ప్రేమించిన పెద్దలకి, ప్రియురాళ్ళకి, స్నేహితులకి, పిల్లలకి, కష్టం, విచారం, కోపం ఎందుకు తెప్పించాను? ఎందుకు పడ్డాను ఇన్ని కష్టాలు, యీవెలి, యీ నింద, యెన్నటికీ మాయని యీ అపవాదులు?

**మధుర:** మీరు సత్యమని నమ్మిన దాని కోసం.

**చలం:** పర్యవసానం? ఏమీ కనపడదు విడవని వ్యధ తప్ప. లేని సత్యమనేది వుండనీ వుండక పోనీ, నేను యేనాటికి యేది సత్యమనుకున్నానో దాన్ని అనుష్టించకుండా నిలవలేదు.

**మధుర:** చిన్నప్పుడే ఆడపిల్లల గొడవల్లో పడ్డారటగా - మీ మొదటి గొడవ గుర్తుంటే చెప్పండి.

**చలం:** "M"మొదటిసారి నా కళ్ళపడ్డప్పుడు, చిన్నది - యింకా పన్నెండేళ్ళు లేవు. రెండు మాటలేవో, మాట్లాడగానే ' ఇన్నాళ్ళెక్కడ దాక్కున్నావు నాకు కనపడక' అన్నా. ఓసారి స్తంభం పక్కన ఆమెని ముద్దు పెట్టుకుంటో వుంటే చూసి భ్రమపడ్డారు. ''నేను పెళ్ళి చేసుకుంటాను'' అని అరవబోయి సిగ్గుతో నోరు మూసుకున్నా. ఎండాకాలపు మధ్యాహ్నాలు, నేను "B" పాకలో మా పెట్టెబండి విడిచి వుంటే, దాంట్లో యెక్కి కూచునే వాళ్ళం. వెడతానని అనకుండా ఓపికగా గంటల కొద్దీ కూచునేది. ఆమె బుజానికీ, బండికీ మధ్య నావేలు నలుగుతోంది. మెల్లగా నా మెడ కింద ఆమె పెదిమలు కదిలాయి. అది ముద్దు అవునా కాదా అని....

**మధుర:** యీనాటికీ తర్కించుకుంటూ వున్నారు పాపం.

**చలం :** యిప్పుడు అడగితే బాగుండదు. మర్యాదస్తురాలు, పెద్ద కుటుంబానికి అధికారి యేమంటుంది?

**మధుర:** మీ చిన్నతనం...

**చలం:** ఎదుగుతున్న ఆడపిల్లలతో, ఆటలతో, సరసాలతో నాటకాలతోనే గడిచింది ఆ కాలం. చిన్నప్పటి నుంచి దూరంగా వుండే నా బాలమిత్రురాళ్ళ కోసం యేడ్చే వాణ్ని.

**మధుర :** మరి అంత చిన్నప్పుడే పెళ్ళి ఎందుకు చేసుకున్నారు?

**చలం:** చిన్నప్పుడేవిటి? 1911 లో స్కూల్ ఫైనల్ చదివే నాటికి పెద్దల బలవంతంతో నా పెళ్ళి జరిగింది, కారణం లేకుండానే నాకు పెళ్ళి అంటే అయిష్టం. అదిగాక అప్పటికే నాకు ముగ్గురు చిన్న పిల్లల మీద ప్రేమ. కుల వివాహ పట్టింపుల వల్ల చేసుకోలేను. వాళ్ళతో కలిసివుండటానికి వీల్లేదు. ఎంతో బాధపడుతున్నా, గుంజుకున్నా. నాకు పెళ్ళి వద్దని గోలపెట్టా. పారి పోదామని అనుకొన్నా, ఇల్లు కదలనివాడిని, సుకుమారిని, అర్భకుణ్ని. అనారోగ్యుణ్ని నేనెక్కడికి పోగలను?

**మధుర:** మీ యింటి పేరు గుడిపాటి ఎలా అయింది?

**చలం:** మాతామహుడు గుడిపాటి వెంకట్రామయ్యగారు సెటిల్‌మెంటు ఆఫీసరుగా రిటైరయారు. దివాన్ బహద్దరు కూడా. ఆయన నన్ను దత్తత తీసుకున్నారు. మానాన్న కొమ్మూరి సాంబశివరావు. వెంకట సుబ్బమ్మ మా తల్లి. నాకు పుట్టుకతో పార్శ్వపుతలనొప్పి (మైగ్రేన్) వుండేది.

**మధుర:** ప్రేమకోసం ప్రేమించబడడం కోసం అంత యావ చిన్నప్పుడే ఎలా ఏర్పడింది?

**చలం:** మా నాన్న అస్తమానూ నన్ను కొట్టే వాడు. చదువు పేరు చెప్పి కొట్టేవాడు. నా చిన్నతనమంతా అనారోగ్యంతో తండ్రి పట్ల ద్వేషంతో గడిచింది. నేను అమ్మానాన్నల ప్రేమ ఎలాంటిదో ఎరుగను. ఆ కఠిన తరమైన గాఢముద్ర ద్వేషం తరువాత జీవితంలో ప్రేమ కోసం, ప్రేమించి ప్రేమించబడటం కోసం అన్వేషణగా మారిందనుకుంటా.

**మధుర:** మీరు చిన్నప్పుడేవో ప్రతిజ్ఞలు చేశారట?

**చలం:** యెన్నటికీ పెళ్లి చేసుకో గూడదనీ, పెద్దవాళ్ళు బలవంతాన చేసినా పిల్లల్ని కనగూడదనీ, పిల్లల్ని కన్నా వాళ్ళను యేడ్పించకూడదనీ, వాళ్ళు యేడ్చినా యేమైనా సరే, వాళ్ళను కొట్టగూడదనీ అనుకున్నా తీవ్రంగా.

**మధుర:** మొక్కపాటి రామమూర్తి ఎవరు? రత్తమ్మ...

**చలం:** రామ్మూర్తా? బారిష్టరు పార్వతీశం రాసిన మొక్కపాటి నరసింహశాస్త్రిగారి తమ్ముడు. బ్రహ్మ సమాజంలో కలిసి మాతో వున్నాడు. కృష్ణశాస్త్రి కృష్ణపక్షం ముద్దుకృష్ణ వైతాళికులు అంకితం తీసుకున్న గొప్ప మిత్రుడు. నేను నా మొదటి నవల శశిరేఖని రామ్మూర్తికే అంకితం యిచ్చాను.

**మధుర:** కృష్ణశాస్త్రి ఊర్వశికి....

**చలం :** అవును, రత్తమ్మ. రామ్మూర్తి మరదలు. కొన్నాళ్ళు నావద్ద పాఠాలు చెప్పించుకొనేది. మేమిద్దరం ఆబలమైన ఆకర్షణ నుంచి బైటపడలేకపోయాం. రామ్మూర్తి చాలా బాధకు గురయ్యాడు. చలానికి దూరమయినా మళ్ళీ కలుసుకున్నాడు. చివరికి సూళూరు పేట రైల్వే ఆక్సిడెంట్‌లో రత్తమ్మ పోయింది పాపం.

**మధుర:** రామ, రామ! మీ ఆదర్శ స్త్రీ..

**చలం:** లోప రహితమైనది, ఈ భూమి Limitationsని మించి సంచరించేది, ఓ స్త్రీ నాతో మెలుగుతో వుండేది. ఆమె నా స్వప్నచారిణి. ఆమె యీ భూమిమీద అలభ్యమని తెలుసు. అందుకనే నేను ప్రయత్నించి, ఉన్నతుణ్ణయి, ఆమెను అందుకోవాలని చూసే వాణ్ణి. నేను వాంఛించే వెలుగూ వైశాల్యం అన్నీ ఆమెలో లభ్యమవుతాయని ఆశపడే వాణ్ణి. ఎక్కడ, ఎక్కడ, ఎక్కడ? అనే అన్వేషణ నన్ను ఆవరించింది.

**మధుర:** దీక్షితులు గారికీ మీకూ ఎలా కలిసింది?

**చలం:** రాజమండ్రి ట్రయినింగ్ కాలేజీలో 1922-23 ప్రాంతాలలో టీచర్‌గా వుంటున్నప్పుడే దీక్షితులుగారితో పరిచయం అయింది. నా చేత రుక్మిణి అనే మొదటి కథ రాయించి

కొడాలి ఆంజనేయులు గారి సాహితిలో వేసేలా చూశారు. నన్ను కథకుడుగా ఆంధ్ర దేశానికి పరిచయం చేసింది వారే. 1936లో నన్ను రమణ మహర్షి దగ్గరకు తీసికెళ్ళి భగవాన్‌ని పరిచయం చేసిందీ దీక్షితులు గారే. అంతా నన్ను తిట్టే రోజుల్లో సనాతనుడైనా సూనృతంతో, నిష్కాపట్యంతో, నన్ను సమర్థించే వారు.

**మధుర:** మీరు బ్రహ్మ సమాజంలోకి ఎలా వెళ్ళారు?

**చలం:** రఘుపతి వెంకటరత్నం నాయుడు గారంటే నాకు భక్తి, ప్రేమ, గౌరవం. ఆయన వల్ల నా జీవితం నైతికంగా ఆధ్యాత్మికంగా చాలా ప్రభావితం అయింది. నేను కాకినాడ కాలేజీలో చేరి బ్రహ్మసమాజ ప్రార్థనలని చూడగానే నాకు చాలా సహజమైన చోటుకి వొచ్చినట్లు అనిపించింది. నాకు నీతి వర్తన మీదపట్టుదల ఎక్కువయింది. నాశశిరేఖ నవలలో కొంత వుంది ఆ గొడవ.

**మధుర:** మళ్ళీ అందులోంచి ఎలా బయటికి వచ్చేశారు?

**చలం:** జీవితంలో నైతిక సమస్యలు ఏర్పడేటప్పటికి ఈశ్వరుడిపై ప్రశ్నలు బయలుదేరాయి. రత్తమ్మ కారణం బయటికి కొచ్చెయ్యడానికి. భార్యతో లేని పాపం ఇంకోక స్త్రీతో పాపం యెట్లా అయింది?

**మధుర:** అసలు మీకీ ఆడవాళ్ళ గొడవ ఎందుకు పట్టింది?

**చలం:** నేను చదువుకునే రోజుల్లో నా పెద్ద చెల్లెలు అమ్మణ్ణికి భర్తపట్ల ఆమె కిష్టం లేకున్నా శోభనం ఏర్పాటుచేశారు. అప్పుడు మా బావకి ఉత్తరం రాశాను. ఆమెకిష్టం లేదు రావద్దని. ఆ రాత్రి అమ్మణ్ణిని గదిలోకి పంపేవరకు యత్నించాం అడ్డుపడదామని. కాని అమ్మణ్ణి లొంగిపోయింది. మేమేం చెయ్యలేక పోయాం. మా నాన్న నన్ను కొట్టడానికి వచ్చాడు. తిరగబడ్డాను. బైటకి గెంటారు. గర్భాదానం గదిలో ఆడపిల్లలు ఎట్లా మారిపోతారో ఆశ్చర్యం వేస్తుంది. ఇది నా స్త్రీ విమోచనా సంగ్రామానికి ప్రేరణ.

**మధుర:** మీ జీవితంలో అనేక మంది స్త్రీలు వచ్చి వెళ్ళారు. ఇంతమందితో ప్రేమ ఎట్లా సాధ్యం?

**చలం:** ఎంత ప్రయత్నించీ శృంగార వాంఛని ఈనాటి వరకూ జయించలేకపోయాను. అదేలేకపోతే నేను ఎందుకు బతికి? స్త్రీతో కొన్నాళ్ళు స్నేహమైతే, మాలోని శృంగార భావం పాతబడి, ఇంక నన్ను ఆకర్షించడం మానేసేది. అప్పుడు యింకో కొత్త శృంగార సంబంధం కోసం కొట్టుకునే వాడ్ని. ఇది గొప్ప ప్రేమా కాదు. ఉత్తకామమూ కాదు. ఇవన్నీ వాంఛలూ విరహం...

**మధుర :** మీరు ఆడపిల్లలతో వున్నప్పుడు చాలా చలాకీగా కలిసీ మెలసీ వుండేవారనుకుంటా-

**చలం:** అదంతా Calf love (లేగ దూడ ప్రణయం). హైస్కూల్లో నా పన్నెండవ యేట నొక అమ్మాయికి ప్రేమలేఖ కూడా రాశా. ఆడపిల్లలతోనే ఎక్కువ స్నేహం. Life is a habit బళ్ళో నా స్నేహితులకి నన్ను చూడగానే నిష్కారణమైన అయిష్టం. నా జాతకంలో జనద్వేషానికి గురికావాలని వుంది కాబోలు.

**మధుర:** మీ ఆదర్శ స్త్రీయేమైంది?

**చలం:** ఆదర్శ పురుషుడు లేకుండా ఆదర్శ స్త్రీ యెక్కడ్నుంచి వొస్తుంది? ఇది తెలుసుకోటానికి నాకు చాలా కాలం పట్టింది.

**మధుర:** మీ అభిప్రాయాలతో వేరుపడే నాటిపెద్దల గురించి ఏమంటారు?

**చలం:** (నవ్వి) వాళ్ళా. ఆ దయాపరులు రక్తం చూస్తే భరించలేని(.....) వీళ్ళందరిలోనూ యెంతెంత క్రూరత్వం దాక్కుని వుందంటావు? ఆ వేట కోర్కెలని తీర్చుకోక, దాచుకొని, ఉన్నదని కూడా తెలీక, పిట్టల మీద, మృగాల మీద చూపని ఆక్రౌర్యాన్ని, మనుషుల మీదా, కోర్టులలో, ఆఫీసుల్లో యిళ్ళలో తీర్చుకుంటారు. కక్షలు కట్టి, మృగాల బదులు మనుష్యుల్ని, ధనాన్ని, పదవుల్ని వేటాడుతున్నారు. పిల్లల మీద, భార్యమీద, నౌకర్ల మీద చూపుతారు కసి. వీళ్ళందరూ శాకాహారులే. భూత దయాపరులే-

**మధుర:** ఆంధ్ర విశ్వవిద్యాలయం సెనేట్‌లో రామలింగారెడ్డి గారిని చూడగానే ఏమనిపించింది మీకు?

**చలం:** ఆయన్ని చూడగానే నా కళ్ళు చెదిరాయి. నేను స్త్రీనయితే సంసారాన్ని వొదిలి,, ఆయన కోసం వెళ్ళి వుందును!

**మధుర:** రామ్మూర్తి చనిపోయాడని టెలిగ్రాం రాగానే మీకేమనిపించింది?

**చలం:** ఈ సంగతి రామ్మూర్తితో చెప్పాలి. అని. బతికివున్న వాళ్ళు మనతో తగాదా లాడి విరోధులు కావచ్చు. పెళ్ళిళ్ళు చేసుకుని మర్యాదస్తులయి మనకి దూరం కావచ్చు. కాని మనం ప్రేమించిన వాళ్ళు మృతి పొంది మన స్వంత మయిపోతారు.

**మధుర:** స్త్రీల చూపుల్ని గురించి చెప్పండి, (నవ్వు); ఎలా చెబుతారో విందామని.

**చలం:** పురుషుణ్ణి వెదుక్కోడానికి అలవాటయిన స్త్రీ చూపులు అదో విధం. (వేశ్య చూపు వేరు. అవి ధనం కోసం వెతుకుతాయి.) ఈ స్త్రీల చూపులు మోహం కోసం - కాదు. 'అవయవాల కోసం వెతుకుతున్నాయా' అన్నంత అసహ్యంగా వుంటాయి. కొంతమంది స్త్రీలలో ఆకర్షణ- ఎంతయినా కళ్ళ వేపూ పెదవుల వేపే నిలుస్తుంది.

**మధుర:** పాపం పోతనగార్ని ఏడిపించారటగా (నవ్వు)

**చలం:** అవును, 'కన్నుదోయికి అన్యకాంతలడ్డంబైన మాతృభావన సేసిమరలు వాడు' అన్నాడు పోతన, ప్రహ్లాదుడ్ని గూర్చి. ఐదేళ్ళ పిల్లాడికి అన్ని ఆలోచన్లా అని విస్తుపోయా.

**మధుర:** మీది శ్రీరాముడి పార్టీయా? శ్రీకృష్ణుడి పార్టీయా ?

**చలం:** తన ధర్మమేదో రాముడికి తెలీదు. ప్రజలు తప్పు అనుకున్న దాకా చరబడ్డ భార్యని స్వీకరించి గర్భవతిని చెయ్యడంలో యేమీ వికృతం కన్పించలేదు అతనికి. సీతని పరిత్యజించాలని వశిష్ఠుడు బోధించిందాకా ఆచక్రవర్తికి కర్తవ్యం తేలీలేదు . ఇన్ని శాస్త్రాలు చదివిన ఆ ధర్మస్వరూపుడికి, తన కర్తవ్యం తెలిసినంతరవాతయినా, సీతతో యెదుట పడి

మాట్లాడలేదు. అతని బాధనీ, ధర్మనిష్ఠనీ, అంత మహాపతివ్రతా అర్థం చేసుకోదని భయం. పిల్లల కోసమన్నా తగాదా పెడుతుంది. అందుకని ఆ అ బద్ధం వాల్మీకి ఆశ్రమం చూపిస్తామని. ఈ ఘోరాలన్నిటిలోనూ రాముడు యెంత అల్పుడయినాడో ఈనాటికీ తెలీదు ప్రజలకి.

**మధుర:** అట్లా ధర్మానికీ హృదయానికీ మధ్య మధనపడే పాత్రని సృష్టించాలనుకున్నాడేమో వాల్మీకి.

**చలం:** అట్లా అంటే తగాదా యేదీ? ఆదర్శపురుషుడు అంటేనే తను. శ్రీకృష్ణుడే అయితే. ఎవడివిరా నా భార్యనే యెంచుతావా?' అని వాణ్ణి హతమార్చి వుండును. ఎన్నటికీ వశిష్ఠుడ్ని అడగడు. అసలు నోరెత్తనీడు. ఒక్క సీతతో రాముడికి ఇన్ని సమస్యలు. పదహారు వేల మందితో ఏ సమస్యాలేదు శ్రీ కృష్ణుడికి. నువ్వు విష్ణుమూర్తి అవతారానివి అనిచెప్పాలి శ్రీరాముడికి.- తనే భగవంతుణ్ణి అని శ్రీ కృష్ణుడికి తెలుసు.

**మధుర:** గాంధీ గార్ని గురించి మీరే మంటారు?

**చలం:** మహాపురుషులు ప్రపంచానికి రెండు విధాల ఉపకరిస్తారు. ఒకటి : కార్యాలవల్లా, బోధనల వల్లా. రెండోది : తమ దర్శన సాంగత్యాల వల్లా. గాంధీగారిని ఎరిగిన వారు ఆయన పనులకన్నా వ్రాతలకన్న ఆయన గొప్ప వారంటారు. అంటే నిజమైన గొప్పదనం సంపాయించారన్న మాట. ఎందుకంటే మనిషి లోపలి గొప్పతనం ఎంత సంపాయిస్తే అంత విలువా, బరువూ అతని పనులూ మాటలూనూ. ఈ సంగతే చాలామంది ప్రజానాయకులు గమనించరు.

**మధుర:** వీరేశలింగం గారు ఏమవుతారు మీకు?

**చలం:** ఏ పద్ధతిలో నన్నా ఒక మూల గట్టిగా వూపే యోధుడు బైలుదేరాడు. తక్కిన బిల్డింగు అంతా త్వరలోనే కూలుతుంది. వితంతు వివాహాలు సాధించిన వీరేశలింగంగారు స్త్రీ నీతి చట్టాల్ని వెక్కిరించిన. 'చలం'కి స్పిరుచ్యువల్ ఫాదర్.

**మధుర:** కథలు బాగా రాయటానికి చదువుకోవాలా?

**చలం:** చదువుకోకపోతే యింతకన్న మంచికథలు రాద్దును. రాయగల టాలెంట్ మనిషిలో వుంటే, చదువూ పాండిత్యం చాలా అనవసరం.

**మధుర:** శ్రీశ్రీ మీకు ఎట్లా పరిచయం?

**చలం:** రుక్మిణీనాథశాస్త్రిగారు నాకు శ్రీశ్రీ కవిత్వాన్ని తెరిచారు.

**మధుర:** కమ్యూనిజం గురించి మీరేమంటారో వినాలని వుంది.

**చలం:** కమ్యూనిజంలో వుండే గొప్పశక్తి యేమిటంటే, ఏ విషయాన్నయినా సరే = ఆరోగ్యము, విద్య, ఆర్థిక విధానము, దేవుడు, నీతి, దేనికయినా సరే - పాత బూజుల్ని దులిపి, ఈనాటి ప్రజాక్షేమపు దృష్టితో చూడగలగడం. మరి, పెద్ద బలహీనతేమంటే

సిద్ధాంతం లోంచి తప్ప దేనినీ చూడలేక పోవడం, దానికి విరుద్ధమయిన దాంట్లో సత్యం కనపడక పోవడం. ఎంత తర్కంతోనూ, సత్య ప్రదర్శనంతోనూ కూడా కమ్యూనిస్టు విశ్వాసాన్ని చలింపజెయ్యలేము. అదే వాళ్ళ బలం.

**మధుర:** కమ్యూనిజానికి తిరుగు లేదంటారు. అవునా?

**చలం:** కాని, ప్రపంచ చరిత్రలో యెంతగట్టి విశ్వాసాలూ, వాటి గుడ్డి తనంవల్ల అవే బద్ధలై, నూతన సత్యాలకి దారితప్పుకుని ఊడ్చుకుపోయినాయి.

**మధుర:** శ్రీశ్రీ మహాప్రస్థానానికి మీరు రాసిన పీఠిక అన్నం కంటె ఆవకాయ ఎక్కువయినట్లు..

**చలం:** కొంచెం ఆవకాయతో కంచంలో మర్డర్ జరిగిన యింప్రెషన్ కలిగించొచ్చు. అలాగే నా చిన్న పీఠికతో పాఠకులకి శ్రీశ్రీ మహాప్రస్థాన మహాద్వారాన్ని తెరిచాను.

**మధుర:** మరి గూటాల కృష్ణమూర్తి లండన్లో వేసిన రు.750/- మహాప్రస్థానంలో మీ యోగ్యతా పత్రం లేదని మీకు తెలుసా? అది తీసెయ్యడానికి శ్రీశ్రీ వప్పుకున్నారు. కారణం? చదివేవారు బతికి లేరట.

**చలం:** మహాప్రస్థానం ఏడువందలేభై రూపాయలా?

**మధుర:** అదంతా లండన్ గొడవ. అందులో మీ యోగ్యతా పత్రం లేదని ఆంధ్రదేశంలో అంతా దెబ్బలాడారు; చలం పీఠికలేని మహాప్రస్థానం ఏవిటని.

**చలం:** కమ్యూనిస్టులకి సెంటిమెంట్లు వుండవు.

**మధుర:** 'అసలు నాకా ఉద్దేశమే లేదు. ఇదంతా జరుక్‌శాస్త్రి పురమాయింపు' అన్నారు శ్రీశ్రీ; ఎటూ చెప్పలేక!

**మధురవాణి:** శ్రీశ్రీకి యోగ్యతాపత్రం యిచ్చాక కమ్యూనిస్టులంతా మీతో బాగానే వున్నారుగా? తర్వాత ఎందుకు బెడిసింది?

**చలం:** నా 'కొత్త చిగుళ్ళు' అనే కథలో భిక్షువర్షీయసిలోని ముసలమ్మకు ఓ అక్క. దానికోకూతురు. అది సీమటపాకాయలా చాలా చలాకీ - అది చదివేక శ్రీశ్రీ కన్నా కమ్యూనిస్టులకు కోపం ఎక్కింది. అప్పుడు వాళ్ళ తృప్తికి శ్రీశ్రీ నా కొత్త చిగుళ్ళకు జవాబుగా 'హేమంతం' అనే పేలవమైన కథ రాశాడు. కథ నా Forte.

**మధుర:** చలం కలం విశృంఖలం అని తెలియక కాబోలు-

**చలం:** నేను వాళ్ళ అక్కనీ, ఆ వర్గాన్నీ చాలా వేళాకోళంతో అవమానించాననుకున్నారు. నా సౌందర్య పిపాసకి వాళ్లంతా అపస్వరాలన్నాడు శ్రీశ్రీ. మొపాసాని టాల్‌స్టాయ్ చివాట్లు పెట్టినట్టు భిక్షువర్షీయసి చేత నాకు చివాట్లు పెట్టించాడు శ్రీశ్రీ.

**మధుర:** మీ నిరీశ్వరవాదం ఎప్పుడు మొదలయింది?

**చలం:** రవి మరణంతో; 1929లో.

**మధుర:** మీ రచనలు కొన్ని అనువాదాలూ అనుసరణలూవున్నాయని మూలం ఫలానా అని చెప్పలేదనీ మీమీదో ఆరోపణ వుంది.

**చలం:** దైవమిచ్చిన భార్యపై వెల్స్, పాల్ కెయిన్‌ల 'పాషనేట్ ఫ్రండ్స్' 'వుమెన్ దౌగివెన్‌స్ట్‌మి' ల ప్రభావాలు వున్న మాట నిజం. నా ఆశయాలకు ఆలోచనలకు దగ్గరగా వున్న వాటినన్నీ తీసుకున్నా. ఫ్రెంచి నవలా రచయిత మార్సెల్ ప్రస్ట్, జర్మన్ నవలా రచయిత డబ్బునిన్ హెర్మిన్‌ల నుంచి కూడా ప్రేరణ పొందాను. ఇబ్సెన్, షా, రస్సెల్‌ల రచనలు అవుపోశనం పట్టా - ప్లేటో, రూసో, మార్క్స్, బర్క్లీ మొదలయిన రాజకీయ సాంఘిక శాస్త్రవేత్తలందరినీ చదివా. వర్డ్స్‌వర్త్, కీట్సు, బైరన్, షెల్లీల కవితా స్రవంతులు తనివి తీరగా గ్రోలాను. అయితే ట్రాజెడీ ఏమిటంటే - చెప్పమంటావా?

**మధుర:** అయ్యో, దాపరికం దేనికి; చెప్పండి.

**చలం :** మన సాహిత్యంలో అభిప్రాయాల్లో ఆలోచనల్లో కొత్త మార్గాన్ని తొక్కిన వాళ్ళలో నేనొకణ్ణి. అయితే, నేను నారచనల్లో మూలం ఫలానా అని రాసినా పబ్లిషర్లు దాన్ని తీసెయ్యడం-అచ్చులో అన్నీ సొంతాలుగా రావడం జరిగాయి. ఇందు వలన చలం పెద్ద దొంగ అని మీరంతా అనుకున్నారు. మీ పేరుతో వస్తే చాలు అనేవారు ప్రచురణకర్తలు. చివరకు విసిగి నేను పట్టించుకోవడం మానేసా.

**మధుర:** మీ అమ్మాయికి సౌరిస్ అని కొత్త పేరు ఎలా వచ్చింది?

**చలం:** నీకు మధురవాణి అనే పేరు ఎలా వచ్చింది?

**మధుర:** తెలీదు. చెప్పండి వింటా.

**చలం:** అలనాటి నాటకం విప్రనారాయణలో దేవదేవి అక్కగారు మధురవాణి. అక్కడ్నుంచి లాగారు అప్పారావుగారు. అల్లాగే 'సౌరిస్' అనేది ఒక ఆంగ్ల నవలలోని ఫ్రెంచి కథానాయిక పేరు.

**మధుర:** 1921 చాలముఖ్యమటగా, మీ జీవితంలో?

**చలం:** ఔను. ఆఏడాది ఏప్రిల్ 13న సౌరిస్ పుట్టింది. హాస్పేట్‌లో వుండగా నా మొదటి నవల శశిరేఖ రాశా. ముద్దు కృష్ణతో కలిసికొన్నాళ్ళు 'జ్వాల' పత్రిక నడిపా. ఈ కాలంలోనే వొయ్యికీ, డాక్టర్ రంగనాయకమ్మకీ వీలుగా వుంటుందని మకాం బెజవాడకి మార్చాను. రంగనాయకమ్మ గారి ఆసుపత్రి భర్తృహీనలకు. సంఘ బహిష్కృతలకు ఎంతో మందికి ధర్మశాల. నాభార్య టి. మొదటి మహిళా జీవిత భీమా ఏజెంటు. నేను నాస్టూడెంట్సుతో కలిసి నాటకాలు వేస్తూ వుండేవాణ్ణి.

**మధుర:** దీక్షితులు గారూ నాయుడుగారూ కాకుండా మిమ్మల్ని ప్రభావితం చేసిన మూడవ వ్యక్తి ఎవరు?

**చలం:** ఇంకెవరు? భగవాన్ రమణ మహర్షి

**మధుర:** ఖద్దరు కట్టారా ఎప్పుడన్నా?

**చలం:** ఏలూరి నుంచి గుంటూరుకి బదిలీ అయితే మాస్టర్లంతా ఖద్దరు కట్టి గవర్నర్‌ను చూడ్డానికి వెళ్తే, నేను మాత్రం ఆడవాళ్ళు వేసుకునే జంపర్ వేసుకుని వెళ్ళా.

**మధుర:** పై ఉద్యోగులకి ఒళ్ళు మండదా? (నవ్వు)

**చలం:** మండాలనే. (నవ్వు) వెంటనే నరసరావుపేటకు బదిలీ!

**మధుర:** ఎందుకీ రొష్టూ అల్లరీ?

**చలం:** అధికార్లకూ నాకూ చుక్కెదురు. సరైన సూట్లు వేసుకుంటాననీ, ఎక్కువగా నవ్వుననీ, అర్వై ఏళ్ళ వాడికి మల్లే నడుస్తాననీ, నా కింది టీచర్లనీ జవాన్లనీ, రోజూ చివాట్లు క్రమంగా వేస్తూవుంటాననీ, జీవితంలో బాధల్ని గురించి, నా గతీ సంగతీ రోజుకి మూడుసార్లు కనపడ్డ వారితో ఏడుస్తాననీ, వార్తలు చేసొచ్చారు నా తరుపున, నాకీ పని తెప్పించేందుకు.

**మధుర:** మీకెప్పుడూ ప్రమోషన్ రాలేదా?

**చలం:** రాకేమి? 1924లో రాజమండ్రి నుంచి బందరు ప్రమోషన్ మీద వెళ్ళి - అక్కడ అహోబలరావుతోను, జంగం కోటయ్య దేవర కొడుకు సుబ్రమణ్య దేవరతోనూ స్నేహం చేశా.

**మధుర:** బందర్ వెళ్లాక ఏదో ఒక గొప్ప పని చెయ్యకుండా ఎవరూ వూరుకోలేదు. మీరక్కడేం చెయ్యలేదా?

**చలం:** చెయ్యకేమి? బందర్ నోబుల్ కాలేజిలో యింటర్ నేషనల్ బ్రాంచీలో Man & Woman అనే పెద్ద ఆంగ్ల వ్యాసం చదివా. అదే 'స్త్రీ' రచనకు ప్రారంభం.

**మధుర:** మధ్య తరగతి నైతిక విలువల్ని షాక్ చెయ్యటమంటే మీకు సరదా అనుకుంటా?

**చలం:** సరదా కాదు కసి. అయితే మైదానం ఒక ఆర్టిస్టిక్ పీస్. దానిలో షాకింగ్ గుణం చాలా సెకండరీ.

**మధుర:** మిమ్మల్ని గోపీచంద్‌గారు విమర్శించాడనుకుంటా - మీ స్త్రీ పాత్రలకు ఆర్థికమైన సమస్యలేవీ పట్టక పోవడం వెలితి కాదా?

**చలం:** గోపీచంద్ కోతి. నాకు నేను సిన్సియర్‌గా వుండటానికి ప్రయత్నిస్తాను. I have no stakes, ఎటు మొగ్గినా, దేంట్లో కలిసినా, ఏం నమ్మినా నాకు వచ్చే నష్టాలేవీ లేవు. ఏ పట్టీ కొట్టడానికీ నేను సిగ్గుపడను. నాకు వాస్తవమని నిశ్చయంగా తోచాలి.

**మధుర:** మీలో అశాంతికి కారణం?

**చలం:** లోకానికి నాకూ ఏదో సరిపడని సంబంధం ఏర్పడింది. నాకన్న గొప్ప దాంట్లో దేంటోనో లయమైపోతే బావుంటుందనిపిస్తుంది. కాని అదేదో కనపడదు.

**మధుర:** మీకు కాశీలో సంస్కృత విద్యాలయ మందిర్ ఏదో బిరుదిచ్చిందట?

**చలం:** 'సాహిత్య మనీషి' అన్నారు. బిరుదులూ సన్మానాలూ సభలూ అక్కర్లేదని నేను దాన్ని నిరాకరించాను.

**మధుర:** ఈ 'లీల' అంటారెవరు?'

**చలం:** నా జీవితాన్ని యీ భూమి మీదనే అమృతంలో నింపగల స్త్రీని ఇచ్చారు భగవాన్ నాకు. అంతటిలో నాకు తనివి తీరలేదు. లీల దృష్టి వ్యక్తిజీవితపు అందం మీద, నా దృష్టి ప్రత్యేకమైన ప్రయత్నాల విలువల మీద. ఆమె దృష్టి భూమి మీది ప్రపోర్షన్స్ పైన; నా దృష్టి ఆకాశపు Beyond proportions పైన.

**మధుర:** ఆవిడతో మీకెలా పరిచయం?

**చలం:** ఆమె తన పదమూడవ యేటనే నా పుస్తకాన్ని చదివి పిఠాపురం స్వగ్రామం కావడంవలన కృష్ణశాస్త్రి ద్వారా నా సాహిత్యం వైపు ఆకర్షితురాలైనా దగ్గరకు వచ్చింది.

**మధుర:** ఏమైంది చివరకు?

**చలం:** 'నా వంటి స్త్రీ కోరివచ్చిందంటే ఎటువంటి పురుషుడైనా సెవెన్త్ హెవెన్‌లో వుండే వాడు. నీకెక్కడా తృప్తిలేదు. శాంతి లేదు. కృతజ్ఞత లేదు,' అందినన్ను లీల. నేను భగవాన్ వైపు మరో ప్లేన్‌లోకి జరిగాను, దానిముందు తను ఇన్‌ఫీరియర్‌గా ఫీల్ అవుతుంది. దాంతో ఆమె అహం అధికంగా పైకి లేచి - 1949వ సంవత్సరంలో లీల నన్ను వదలి వెళ్ళిపోయింది.

**మధుర:** ఎవరు మీకు ఉత్తరం రాసినా జవాబిచ్చేవారట?

**చలం:** అదొక అలవాటు. ఎవరు నాకు రాసినా స్పందించే గుణం నాది.

**మధుర:** టాగూర్ అంటే మీకు ప్రాణం అనుకుంటా.

**చలం:** టాగూరు కవిత్వం యీ బొమికల్లోకి ఎక్కింది. బ్రహ్మ సమాజమూ దేవుడూ భక్తి నన్ను వొదిలి పోయిందాకా, ఒక ఐదేళ్ళు టాగూరు కవిత్వం తాగి బతికాను. ఆయన వ్రాసిన భక్తి నన్ను వొదిలినా కవిత్వం వొదల లేదు..... భక్తులకి ప్రేమ గీతాల్లో భక్తి గోచరిస్తుంది. నాకు భక్తిగీతాల్లో ప్రేమ గోచరిస్తుంది.

**మధుర:** మీ కెప్పుడన్నా సన్మానం జరిగిందా?

**చలం:** 1960లో చిత్తూరు నుంచి శారదాపీఠం ఆధ్వర్యంలో కె. సభా వందమంది రచయితలతో కళాకారులతో వచ్చి రమణస్థాన్ తిరువణ్ణామలైలో నాకు సన్మానం చేశారు. అదే మొదటిది.

**మధుర:** ఆనందం అంటే ఏమిటి?

**చలం:** నరాల సంచలనం. స్త్రీ నించి పొందే ఆనందాన్ని ఆకాశపు నీలత్వంలోంచి, నీళ్ళ చల్లదనంలోంచి, గడ్డి మెత్తదనంలోంచి, పువ్వుల మెరుగులోంచి పొందాలి.

**మధుర:** సుఖం దేనికి?

**చలం:** స్వేచ్ఛ లేని సుఖంలో మనిషి నిలవలేడు. తనస్వంత సుఖాల్ని తనలోపల్నుంచి కట్టుకోవాలి మానవుడు. లోకంలో మనం ఏర్పరచే సుఖపద్ధతి జంతు ప్రదర్శనశాల జంతువులకిచ్చినంత సుఖాన్ని యిస్తుంది.

**మధుర:** మిమ్మల్ని ఆనందోపాసకులు అనవచ్చా?

**చలం:** మనిషిలో ఎట్లా వుందో, ఎందుకు వుందో అతని లోపలే గొప్ప ఆనందం వుంది. అయితే ఒకప్పుడు లోపలి ఆనందాల్ని పై వస్తువుల సహాయంతో అనుభవిస్తున్నాడు. లోపలి ఆనందాన్ని అందుకుంటే జీవితం ప్రతి నిముషం ఆనందమయం కాదా?

**మధుర:** భావకవులు తీసుకొచ్చిన అమలిన శృంగారం గురించి మీరేవంటారు?

**చలం:** మధురవాణి అనే వేశ్యారత్నం అమలిన శృంగారం గురించి అడగటమా? నేను మీ పక్షమే. భౌతికం కాని కేవల మానసిక శృంగారాన్ని నేను నిరసిస్తాను. ఎందుకు బ్రతుకుతున్నావు అంటే ప్రేమించేందుకు, ప్రేమని వెతుక్కునేందుకు అని చెప్పగలగాలి.

**మధుర:** కాలం దేశంవల్ల నీతులూ ధర్మాలూ మారతాయా?

**చలం:** అంతరాత్మే నీతికి ప్రమాణం. ఏ మనిషి కామనిషికి ఏది తనకి ధర్మమో, కర్తవ్యమో స్పష్టంగా తెలుస్తూనే వుంటుంది. స్వార్థం నుంచి దూరమైన కొద్దీ వున్నతుడవుతాడు మనిషి. నీకులా-

**మధుర:** నన్నెందుకు పొగడ్డం?

**చలం:** నీకున్న క్లారిటీ (స్పష్టమైన అవగాహన) నాకు లేదు. లీల గారి కంటె నువ్వే ఎన్నో రెట్లు నయం. నీకు అహంకారం అడ్డం రాదు. పోనీ నువ్వు నాతో వచ్చేస్తావా?

**మధుర:** నేను మీతో వచ్చేస్తే అక్కడ మా అమ్మకి గడవడం ఎల్లాగ?

**చలం:** పోనీ మీ అమ్మని కూడా మనతో వుండమంటే-

**మధుర:** ఆమె రాదు. చెడినవారిని యింకా చెడగొట్టవద్దని మా తల్లి ఆదేశం.

**చలం:** ఎవరో సత్పురుషుడు కాలుజారగా పుట్టిన పిల్లవై యుంటావన్నాడు సౌజన్యారావు పంతులు నిన్ను.

**మధుర:** మీరే వంటారు?

**చలం:** నిన్ను చూశాక కాల్జారకుండా వుండటం అబ్సర్డ్ అంటాను.

**మధుర:** (నవ్వి) ఈ ఒక్కటీ చెప్పండి. దేన్ని సౌందర్యం అనొచ్చు?

**చలం:** నరాల్ని నీలా అందంతో లాగి బాధించేది. ఏదో రహస్యమైన ఆకర్షణ, ఏ నడకో, ఏమాట మాధుర్యమో, ఏ కామవిస్ఫురణో నీకు దాసుల్ని చేసుకుంటాయి.

**మధుర:** నన్ను పట్టించారేవిటివ్వాళ?

**చలం:** పోలికలకూ, ఉపమానాలకూ అందని నీ స్వభావం ఆత్మకు సంబంధించినదై వుంటుంది. గొప్ప ఆత్మ లేకుండా గొప్ప సౌందర్యం యెక్కడ? సౌందర్యానికి అంధులు కావటం కన్నా సౌందర్యం మామూలయి పోవటం కన్నా మృత్యువు వేరే లేదు.

యజమానిని వెనక్కు నెట్టి ఎడిటర్ ముందుకు వచ్చాడు. మీ తరువాత అఫీస్ మేనేజర్, మార్కెటింగ్ మేనేజర్ ఎడిటర్ని మూలకూచోబెట్టి న్యూస్‌పేపరు మీద పెత్తనం చలాయించసాగారు.

**నార్ల:** నీకింత భోగట్టా ఎలా తెలుసు?

**మధుర:** మీ తర్వాత, గోరాశాస్త్రి తర్వాత ఎడిటర్లెక్కడ వున్నారు? యిప్పుడంతా లిఫ్టిరిగేషనే కదా! నా కెలా తెలుసునంటున్నారా? గిరీశంగారు ప్రెస్ క్లబ్‌కి వెళ్లొస్తుంటారు. వెంకటేశం ప్రెస్ క్లబ్ మెంబర్ కూడా. ఏదో యింగ్లీషు పేపరికి విలేకరిగా వుంటున్నాడు.

**నార్ల:** మాకంటే నువ్వే ఎక్కువ న్యూస్ కాన్షస్‌గా వున్నావు?

**మధుర:** ఆర్నెల్లు సావాసం చేస్తే వారు వీరువుతారు. గోగినేని రంగనాయకులు అని వార్త ప్రచురించి మీరు యన్. జి. రంగాగారికి వ్యతిరేకి అయారు కొంతకాలం. ఆంధ్రకేసరి ప్రకాశాన్ని తిడుతూ పంచ మహాపాతకాలు అని అయిదు సంపాదకీయాలు రాశారు. పొట్టి శ్రీరాములు గారి ఆమరణ నిరాహారదీక్షను కూడా మీరు సానుభూతితో చూడలేదనుకుంటా. బహుశా ప్రజలకు ఎదురు వెళ్ళడం కూడా మీజర్నలిజంలో ఒక యెత్తు కావచ్చు.

**నార్ల:** మన పేపర్లని వ్యతిరేకించి జనం తగులబెడుతూంటే నాకు గొప్ప సంతోషంగా వుండేది.

**మధుర:** ఒకటి, వాళ్ళు మూర్ఖులని మీ అభిప్రాయం. రెండు; వాళ్ళు వ్యానును కాని పేపరును కాని తగులబెడుతూంటే మీ ' ఇగో' పెరుగుతుంది. నష్టపోయేది యాజమాన్యమే. మీరు మ్యానేజిమెంట్లకి ఐరావతంలా మారారు.

**నార్ల:** స్టోన్ దగ్గర నేను కింగ్‌లా వుండేవాడ్ని. నా ఐడియాస్ అన్నీ అక్కడే వచ్చేవి.

**మధుర:** మద్రాసులో మెయిల్ టైముకి ఎప్పుడూ అందిచ్చే వారు కాదట. రోజూ టాక్సీ పెట్టి కట్టలు సూళ్ళూరుపేట తీసికెళ్లి అందిచ్చేవారట గదా!

**నార్ల:** ఏదో ఏడ్చే వారు. నేను అనుకున్నట్లు పేజీ వచ్చే దాకా స్టోన్ దగ్గర కుస్తీ పట్టేవాడ్ని.

**మధుర:** మాలతీచందూర్‌ని మీరేకదా డిస్కవర్ చేసింది?

**నార్ల:** అవును. ప్రమదావనం నేను పెట్టిన శీర్షికే. లతచేత ఊహాగానం రాయించింది నేనే. పురాణాన్ని కూడా రైల్వేల నుండి రిజైన్ చేయించి జర్నలిజానికి తెచ్చింది నేనే. తుర్లపాటి నా అడుగుజాడల్లో నడిచి ఎడిటోరియల్ రాస్తే అచ్చం నేను రాసినట్లుండేది. అంతా నా వరవడే.

**మధుర:** నండూరి రామమోహనరావుగారు రాస్తే మీరు రాసిందేదో ఆయన రాసిందేదో గుర్తు పట్టడం అసాధ్యంగా వుండేదట. ఆయన కంత పరకాయప్రవేశం వచ్చునా?

**నార్ల:** దేశికవితా మండలి గొర్రెపాటి వెంకటసుబ్బయ్య నా జీవిత చరిత్ర రాశాడు. అందులో తను వుదహరించిన సంపాదకీయాలేవీ నావి కావు, ఏడిచి! అవన్నీ రామ్మోహనరావు రాసినవే.

**మధుర:** మీకతను అంత నమ్మిన మనిషి అనుకుంటా-

**నార్ల:** ఏడిచి!- వీళ్ళంతా నేను తెచ్చి తయారుచేసిన వాళ్ళే. ఆ ప్రసాద్‌తో కలిసి నన్ను 'బిత్రే' చేశారు.

**మధుర:** మీరు ఉద్యోగాన్నుంచి రిటైర్ అయ్యారుగావును?

**నార్ల:** కాదు. రిజైన్ చేశాను. నాకు ఇందిరా కాంగ్రెస్; బ్రహ్మానందరెడ్డి అంటే అసహ్యం. సంజయగాంధీ గుంటూరు వచ్చినప్పుడు రఘురామయ్య అతగాడి అడుగులకు మడుగు లొత్తాడు; మరో టుబాకో వాడెవడో వాడికి యింకేదో యేర్పాట్లు చేశాడు. వాడెవడసలు?

**మధుర:** నెహ్రూ మనవడు. ఇందిరాగాంధీ రెండో సుపుత్రుడు.

**నార్ల:** వాడిమీద ఎడిటోరియల్ రాయించాడు ప్రసాద్.

**మధుర:** ప్రసాద్‌గారు కాదు. ఆఫీస్ మేనేజర్ రాయించాడు. గుంటూరు వాళ్ళు ఆరోజు యాభైపుల్ పేజీలు మీ పత్రిక్కి అడ్వర్టయిజుమెంట్లు యిచ్చారు.

**నార్ల:** అందుకని కాంగ్రెస్ ( ఐ) పాలసీని వ్యతిరేకిస్తున్న ఎడిటర్‌ని నన్ను కాదని ఆ సంజయగాంధీ మీద ఎడిటోరియల్ రాయిస్తారా? నాతల తీసికెళ్ళి ఎక్కడ పెట్టుకోను?

**మధుర:** మీ యజమానికేదో వ్యాపార ప్రయోజనాలు లక్ష వుంటాయి. మీదొక దారీ ఆయన్ది మరొక దారీ అయితే నవ్వదా లోకం.

**నార్ల:** అందుకే - రిజైన్ చేశా!

**మధుర:** యింత మాత్రానికే మీరు వీధిన పడాలా?

ప్రసాద్‌గారు మీకెంత చేశారు? ఆయన మిమ్మల్ని ఉద్యోగిగా చూడలేదే! ఎంతో మర్యాద యిచ్చారు....

**నార్ల:** ఈ పేపరుని అడ్డం పెట్టుకుని అతను తన ఇమేజిని ఎంత పెంచుకున్నాడో! ఈ పేపర్ని నేను కదా, సృష్టించి యిచ్చాను!

**మధుర:** ఆంధ్రజ్యోతి పెట్టిన కొత్తలో ప్రభ రీడర్ షిప్ అంతా మీకొస్తుందని మీకీర్తిని గురించి భ్రమపడ్డారు కాదా?

**నార్ల:** నార్లలేని పత్రిక ఉప్పులేని పప్పులా వుంటుంది అని అనుకోలేదు జనం. అదో పెద్ద ట్రాజిడీ.

**మధుర:** ఆ రోజుల్లో మీరు ఏర్పాటు చేసిన ప్రభ ఏజంట్లను అది మానేసి యిది పుచ్చుకో మంటే అంతా మిమ్మల్ని చూడగానే పారిపోయే వారట గదా! అసలు ఈ ''ఆంధ్రజ్యోతి'' అనే పేరెట్లా సంపాదించారు మీరు?

**నార్ల:** ఆంధ్రజ్యోతి అనే వార పత్రికను 1940లో బి. ఎన్. గుప్త అనేవారు ప్రారంభించారు. దానిని నేనే ఎడిట్ చేసేవాణ్ణి. అదిపోయిన కొన్నాళ్ళకి అంటే 1945లో గావును; చక్రపాణి గారు ''ఆంధ్రజ్యోతి'' అని మంత్లీ పెట్టేరు. ఆ పిమ్మట రాజమండ్రిలో దంటు కృష్ణమూర్తి

అనే అతన్ని '' ఆంధ్రజ్యోతి'' అని అప్పుడప్పుడు వచ్చి ఆగిపోయే దినపత్రిక వుండేది.

**మధుర:** అది మీరు కొనేసి వుంటారు. మద్రాసు నుండి తెలుగు పత్రికల్ని విజయవాడకు తర్లించిన ఘనత మీదేనా?

**నార్ల:** పూర్తిగా మాది కాదు. అంతకుముందే ప్రజాశక్తి దినపత్రిక కాట్రగడ్డ రాజగోపాల రావుగారి ఆధ్వర్యంలో కాబోలు విజయవాడ నుంచి వచ్చేది. అది కమ్యూనిస్టుల దినపత్రిక - యిది ఆంధ్రుల జాతీయ దినపత్రిక.

**మధుర:** మీరు అందులోంచి తప్పుకున్నాక ప్రభ చాలా మెరిగిందట, అవునా? చీపురు కట్టని సంపాదకుడుగా పెట్టి పత్రికను నడిపిస్తానని ఆ యజమాని అన్నాడట?

**నార్ల:** అలా పలికింది వాళ్ళ డబ్బు. పత్రిక పెరగడానికి అనేక కారణాలుంటాయి. మత విషయాలకు ప్రాధాన్యం యివ్వక పోవడం, హేతువాదం, గాంధీయిజం, విజ్ఞానం, సైన్స్, పరిశోధన; యివి పత్రిక లక్ష్యాలుగా నడిపాను. ఆదర్శాలు కల ఎడిటర్‌కి ఆ ఆదర్శాలే సంకెళ్ళు.

**మధుర:** వాస్తవమ్మ్మ నార్ల వారి మాట!

**నార్ల:** నువ్వు ఫాలో అయ్యావా నా పద్యాలు?

**మధుర:** అవ్వేం పద్యాలండీ? పూర్ ఇమిటేషన్స్ ఆఫ్ వేమన.

**నార్ల:** నా కవిత్వం నీకు నచ్చలేదన్న మాట.

**మధుర:** మంచి ఎడిటర్‌గా తిరుగులేని పేరు తెచ్చుకున్నారు. మళ్ళీ కవిగా కూడా నిలబడాలని ఎందుకో ఆరాటం?

**నార్ల:** జర్నలిజం క్షణికం - అశాశ్వతం. సాహిత్యంలో నిలబడితే గొప్ప.

**మధుర :** మీ నాటకాల్లో 'పాంచరాత్రం' చాలా గొప్పది. నిలుస్తుంది. ద్రౌపది అయిదు గురు భర్తలతో ఐదు రాత్రులు గడపడం అనేది గొప్ప ఐడియా.

**నార్ల:** మరి నా సీత జోస్యం, నరసింహావతారం మాటో-

**మధుర :** మీ కొత్త గడ్డలో నాటికలు బావుంటాయి. సీత జోస్యంలో రాముడు చాలా వీక్, నరసింహావతారం కొంచెం కృతకంగా వుంది. పురాణ కథల్ని అలానే చూడాలిగాని అవి నిజంగా జరిగిన వని భ్రమించి వాటికి జవాబు చెప్పాలనుకోవడం, ఇలా కాదు ఇలా జరిగిందని రాయడం అంత అవసరమా?

**నార్ల:** ఎవరిష్టం వారిది. నాకు బ్రామినిజం అంటే పడదు. బ్రాహ్మలంటే కాదు. నా అసిస్టెంట్లందరూ వాళ్ళే-

**మధుర:** నార్ల చిరంజీవి మీకే మవుతాడు?

**నార్ల:** ఏమీ కాదు. అతనో కమ్యూనిస్ట్ కవి.

**నార్ల వెంకటేశ్వరరావు**

**మధుర:** మీకు కమ్యూనిజం అంటేనే గిట్టదా?

**నార్ల:** గిట్టదు. ఒకసారి ఓ కమ్యూనిస్ట్ ప్రబుద్ధుడు అన్నాడు '' ఈ భూస్వాముల భార్యల మెడలపై కాడి వేసి భూమిని దున్నిస్తాం మేం అధికారంలోకి వస్తే'' అని. అప్పుడు నాకు కోపం వచ్చి కార్టూన్లయుద్ధం ప్రారంభించాను. అటువైపు నుంచి విశాలాంధ్రలో రాంభట్ల వేశాడు జవాబుగా కార్టూన్లు.

**మధుర:** తెలుగు దినపత్రికలలో రాజకీయ వ్యంగ్య చిత్రాన్ని ప్రవేశపెట్టిన ఎడిటర్ మీరేనా?

**నార్ల:** కార్టూన్ యుద్ధాలెన్నో చేశాను. ఎడిటర్‌ని ఒక ముఖ్యమంత్రి, మంత్రి, రాజకీయ నాయకుడితో సమానంగా నిలబెట్టాను.

**మధుర:** భూస్వాముల భార్యల మెడలపై కాడివేసి పొలాలను దున్నిస్తామని ప్రగల్భాలు పలికిన కమ్యూనిస్ట్ లెవరు ఎడిటర్జీ?

**నార్ల:** మాకినేని బసవ పున్నయ్య. మార్క్సిస్ట్ పార్టీపోలిట్ బ్యూరోమెంబరు. ఆయన కమ్యూనిస్టుల్లో అరిస్టోక్రాట్. గోల్డ్‌ఫ్లేక్ సిగరెట్లు తప్ప తక్కువ రకం కాల్చేవాడు కాదు. చలాన్ని శ్రద్ధగా చదవమని కమ్యూనిస్ట్ కేడర్లకు రహస్య సర్క్యులర్ జారీ జేశాడు.

**మధుర:** చలంగారి మీద అంత మోజెల్లా ఏర్పడిందో?

**నార్ల:** శ్రీశ్రీ మహాప్రస్థానానికి యోగ్యతా పత్రం యిచ్చాడు చలం. అది చూసి కమ్యూనిస్టులు చలం మావాడని చంక లెగరేశారు; మాచకమ్మను చూసి సన్యాసి చంకలు గుద్దుకున్నట్లు.

**మధుర:** విశాలాంధ్ర వారితో గురజాడ మాన్యుస్క్రిప్టు తగువేమిటి? వివరంగా చెప్తారా?

**నార్ల:** గురజాడ వ్రాతప్రతులు డైరీలు అన్నీ విశాలాంధ్రవారి వద్ద వున్నాయి. అవి గురజాడ వెంకటరామదాసు నుంచి కొన్నారనుకుంటా. ఆ రామదాసు సరైన సాహితీ వారసుడు కాదు. గురజాడ లైబ్రరీ అంతా సెకండ్ హ్యాండు పుస్తకాలుగా అమ్మేశాడు విజయనగరంలో. నేను సాహిత్య అకాడమీకి గురజాడ మీద మోనోగ్రాఫ్ రాస్తూ, ఆ గురజాడ మాన్యుస్క్రిప్ట్సును చూస్తే మంచిదని కాట్రగడ్డ రాజగోపాలరావుని అడిగాను ఒకసారి చూస్తానని. ఆయన ఆట్రంకు పెట్టెల్ని మా యింటికి పంపిచాడు భద్రంగా.

**మధుర:** మీరూ మీ శిష్యుడు పురాణం; విశాలాంధ్ర వారికి వెన్నుపోటు పొడిచారట గదా-

**నార్ల:** నో-నో- అవసరాల సూర్యారావు వాటిని హేండిల్ చేశాడు. అతను బి.య్యే.తెలుగు. యింగ్లీషు సరిగా రాదు. అప్పారావు గారు అన్ని డైరీలు, ''మైవోన్'', ''హిజ్ హైనెస్'' అని అన్నీ యింగ్లీషులోనే రాశారు. అవి అల్లానే యింగ్లీషులో అచ్చువేసి వుండాల్సింది.

**మధుర:** విశాలాంధ్ర వారు ఏం చేశారుట?

**నార్ల:** ఆ కట్టలన్నీ సూర్యారావు మొహాన పారేశారు. అతను బుద్ధి దీపం వెల్తుర్లో అప్పారావు గారు రాసిన వాటికి కొంత వదిలి కొంత చేర్చి అనువాదాలు చేశాడు. అవన్నీ 'డైరీలు', 'మాటా-మంతీ', 'కథానికలు', 'ముత్యాల సరాలు' అంటూ అచ్చుయాయి. ఈ పనులన్నీ పూర్తవకుండానే సూర్యారావు పోయాడు.

**మధుర:** అప్పుడు మీరీ తేనెటీగల తుట్టెను కదిల్చారన్న మాట!

**నార్ల:** అలా మూలంతో తైపారు వేస్తూ పోతే చాలా దోషాలు కనిపించాయి. ఒకరి రచనలను మూలానికి భిన్నంగా మార్చి అనువదించటాన్ని ఇంగ్లీషులో 'ఫోర్జరీ'లు అంటారు. అప్పటికే సూర్యారావు అనువాదాలు ఆధారంగా ఇంగ్లీషులోకీ రష్యన్ లోకీ అప్పారావుగారి రచనలు వెళ్ళిపోయాయి. ఆయనకు తీరని అపచారం జరిగిందని గ్రహించాను.

**మధుర:** అవును. విశాలాంధ్ర వారు సూర్యారావుకి అప్పగించారే కాని ఆ అనువాదాలు ఎలా వున్నాయున్నది వారు పట్టించుకోలేదు. అలా మహాకవికి అపచారం జరిగిపోయింది.

**నార్ల:** సూర్యారావు యిదంతా తెలిసి చేయలేదు. అతనికి సరిగా యింగ్లీషు రాదు; అంతే. బ్రింజాల్స్ అంటే పచ్చిమిరపకాయలు అని రాశాడు. Called on him, called అన్న ప్రయోగాలకి అర్థం తెలియక "His Highness Called him' - "Apparow called on His highness" అన్న దానికి తప్పుగా రాశాడు. డైరీల్లో కొన్ని కొన్ని దాటవేశాడు.

**మధుర:** కోతికి కొబ్బరికాయ దొరికినట్లు మీకు యింత అవకతవకల గ్రంథం దొరికింది. ఐతే, మీరు విశాలాంధ్ర వాళ్ళతో సంప్రదించాల్సింది, ముందుగా.

**నార్ల:** నాకు ఓపిక లేక యీ అవకతవకలు ఫోర్జరీల గురించి నా అసిస్టెంటు పురాణాన్ని దినపత్రికలో వ్యాసాలు రాయమన్నాను. పైగా యీ డైరీలన్నీ సరిగ్గా మళ్ళీ వ్రాయించటం టైపు చేయించటం ఈ పనులు అవసరమయాయి. ఒక ఆర్నెల్లకి పైగా వాటిమీద నా అజమాయిషీలో, పాటిబండ్ల సుందరరావు, గొల్లపూడి మారుతీరావు, కె.వి. రమణారెడ్డి, తుమ్మల వెంకట్రామయ్యగార్లు పనిచేశారు అదీ, ఆ క్షాళన కార్యక్రమం.

**మధుర:** విశాలాంధ్రవారు జవాబులు వ్రాయలేదా? వూరుకున్నారా.

**నార్ల:** ఏటుకూరి బలరామూర్తి గారు పురాణం హెల్పుతోనే 'జవాబు వ్యాసాలు' రాశారు. వీళ్ళంతా స్నేహితులే, విరోధాలేం లేవు మాకు.

**మధుర:** మీరు ఆంధ్రజ్యోతిలో 'ఫోర్జరీలు' అని కాంట్రవర్సీ లేవదీయడంవల్ల కమ్యూనిస్టులకి కళ్లెర్రబడ్డాయన్నమాటా?

**నార్ల:** కన్నెర్రకాకేమీ? నేను వాళ్ళ వద్దనుంచి వ్రాత ప్రతులు తెచ్చి వాళ్ళకన్నే పొడిచానని!

**మధుర:** మీ గురజాడ మోనోగ్రాఫ్ సంగతేంటి, మరి?

**నార్ల:** పూర్తిచేశా. పుస్తకం వచ్చింది.

**మధుర:** కీర్తి మీకూ అపకీర్తి పురాణానికి వచ్చి వుంటుంది. తడిక తోసిన వాడిదేగదా తప్పు అంతా.

* * *

**మధురవాణి నార్లవారి లైబ్రరీలో పుస్తకాలను చూస్తూ మాట్లాడుతూ వుంటుంది. నార్ల పుస్తకాలపై డస్ట్ దులుపుతూ మళ్ళీ అరల్లో సర్దుతూవుంటారు.**

**మధురవాణి:** గ్రంధచౌర్యం మీకు బాగా తెలుసంటారు. నిజమేనా?

**నార్ల:** ఒక శబ్దాన్ని ప్రయోగించేముందు దాని అర్థం తెలుసుకుని మాట్లాడడం మంచిది.

**మధుర:** తెలుసుకోడానికి యిందులో ఏంవుంది? పుస్తకాలు దొంగలించడాన్ని గ్రంథచౌర్యం అంటారు కదా!

**నార్ల:** గ్రంథచౌర్యం అంటే : ఏదేనా ఒక ప్రసిద్ధకవి రచయిత రాసినదాన్ని మరొకరెవరైనా తనపేర ప్రకటించుకున్న తరవాత నాలాటి ఎడిటర్స్‌కి దొరికిపోతే గ్రంథచౌర్యం అంటారు. అది తెలుసుకోముందు!

**మధుర:** పుస్తకాల దొంగల్ని గ్రంథచోరులు అనకూడదా?

**నార్ల:** నా లైబ్రరీ చూస్తూంటే నీకు మధ్యన వాళ్ళెందుకు గుర్తుకొచ్చారు?

**మధుర:** ఇవన్నీ మీరు కొన్నవేనా లేక సంగ్రహించి తెచ్చినవా?

**నార్ల:** నాదగ్గర రెండురూపాయలుంటే ఒకరూపాయి తిండికి కర్చుపెట్టి, ఒకరూపాయితో పుస్తకం కొన్నాను.

**మధుర:** శ్రీశ్రీగారి దగ్గర రెండురూపాయలుంటే (తాను పస్తుండి) రెండు రూపాయలూ పెట్టి పుస్తకం కొని చదివాడటగా పాపం!

**నార్ల:** నేను కష్టపడి యింత లైబ్రరీ సేకరించాను.

**మధుర:** తేనెటీగలు మధువును కూడబెట్టినట్లు...అయితే ఇంతకీ యివన్నీ కొన్నవేనా అని?

**నార్ల:** నీకెందుకా అనుమానం?

**మధుర:** ఇన్ని పుస్తకాలు చదవాలంటే మానవ మాత్రుడివల్ల అయ్యే పనేనా? మీరు మానవులా, కంప్యూటరా?

**నార్ల:** నేను నీ కంటికెలా కనిపిస్తున్నాను?

**మధుర:** ఎడిటర్ వేషం వేసుకున్న శ్రీకృష్ణుడిలా వున్నారు.

**నార్ల:** కృష్ణుడేవిటి? భగవద్గీత అంటేనే నాకు పడదు. (నవ్వి) పుస్తకాలు సేకరించటం నా హాబీ.

**మధుర:** అందుకే మిమ్మల్ని 'సంపాదకుడు' అన్నారు. రివ్యూకివచ్చిన కొత్త పుస్తకాల్ని లైబ్రరీలకిచ్చి లైబ్రరీల్లోని పాతపుస్తకాలను సంగ్రహించే వారటగదా, ఏమి చాక చక్యం?

**నార్ల:** ఎల్లాగైనా ఆ పుస్తకాలు లైబ్రరీల్లోంచి పోయేవే - నేను అవన్నీ జాగ్రత్తగా బైండుచేయించి కేటలాగింగ్ చేసి భద్రపరిచేవాడ్ని. సొంతలైబ్రరీ ప్రియురాలి కన్నా ఎక్కువ.

**మధుర :** మీ సబ్ ఎడిటర్లని లైబ్రరీల్లో చేర్పించి వారి చేత మీకు కావలసిన పుస్తకాలను తెప్పించుకుని అవి పోయాయని చెప్పి వాటికి జుర్మానాలో ఖరీదో కట్టేసేవారటగదా! ఏంగడుసుదనం?

**నార్ల:** ఇవన్నీ ఎవరు నీతో చెప్పింది?

**మధుర:** శ్రీశ్రీ గారు; పేదలకవి.

**నార్ల:** అతగాడు నావద్ద సబ్ ఎడిటర్‌గా కొన్నాళ్ళు ఆంధ్రప్రభలో వెలిగించాడులే ఉద్యోగం. నేను ఎడిటర్‌గా వుండగా నామీద వ్యంగ్యరచనలాటిది నాకు తెలియకుండా చేయించి నాపేపర్లో వేశాడు. వెంటనే పీకిపారేశా. అందుకే 'శ్రీ' అంటే విషం; 'శ్రీశ్రీ' అంటే విప్లవం అన్నా అతగాడి షష్టిపూర్తికి.

**మధుర:** శ్రీశ్రీ అంటే మీకు పడదా? కమ్యూనిజమా, పేదలా; మీకు గిట్టనిది?

**నార్ల:** అతగాడి పద్యాలన్నీ దేనికో ఓదానికి కాపీలు. ఏవితల్లీ నిరుడుకురిసిన హిమసమూహములు, "Where are the snows of yester years"కి కాపీ. 'తాజ్‌మహలు నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు' యీ ఐడియాకూడా బెర్టోల్డ్ బ్రెక్ట్ అనే జర్మన్ కమ్యూనిస్ట్ కవి రచనలకు ప్రతిధ్వనులే. బేసిక్‌గా అతడికి నిజాయితీ లేదు.

**మధుర:** రామ రామ! ఎడిటర్లింత నిర్దయగా వుండగలరని మిమ్మల్ని చూసే గ్రహించాను. మీరు ఎవర్నీనమ్మరు. ఎవర్నీ గుర్తించరు. అందుకే మిమ్మల్ని పెసిమిస్టు అన్నాడు మహాకవి.

**నార్ల:** ఈ ప్రపంచమే నాలాంటి కొందరిని పెసిమిస్టులుగా మార్చేసింది. అంతా వంచనే, అందరూ దొంగలే !

**మధుర:** అందుకే మీరు నవ్వగా చూసినవారు లేరంటారు. అవును మిమ్మల్ని నమ్ముకుని ఆంధ్రజ్యోతి ప్రారంభిస్తే అది కె. ఎల్. ఎన్. ప్రసాదుగారిని మూడుచెరువుల నీళ్ళను త్రాగించి ముప్పుతిప్పలు పెట్టిందంటారు. అందుకే ఆయన, హైదరాబాద్ ఎడిషన్ పెడదామంటే, తెనాలి రామలింగడి పిల్లిలా భయపడి తప్పించుకున్నాడన్నారు. అవునా?

**నార్ల:** ఆంధ్రజ్యోతి వల్లే అతగాడు ఆంధ్రదేశానికి పరిచయమయ్యాడు. ఆంధ్రజ్యోతి వల్లే అతను రాజ్యసభ సభ్యుడయ్యాడు.

**మధుర:** మీరు గొప్ప ఎడిటర్ అని అనుకోవడంలో తప్పులేదు. నిస్సందేహంగా అంతవారే కాని - మీకు కోపంరాకుండా వుంటే ఒక్కమాట.

**నార్ల:** అడుగు అమ్మీ! సందేహిస్తావు దేనికి?

**మధుర:** ఏమీలేదు. మీరు ప్రభలో మానేసినపుడు, (అదే, మానేసి యువతలకు వచ్చినపుడు,) ఆ సర్క్యులేషన్ అంతా మీ వెనకాల వస్తుందనుకున్నారు అవునా?

**నార్ల:** అదంతా నేను నా ప్రతిభతో సంపాదకీయాల్తో శీర్షికల్తో బిల్డప్ చేసినదే

**మధుర:** కావచ్చు. ఒక పత్రిక విజయానికి దాని వెనుక నున్న యంత్రాంగం యజమానుల డబ్బు కూడా కారణమని మీరు తెలుసుకోలేదు. తెలుసుకున్నా గుర్తించ నిరాకరించారు. అదే తప్పు మీరు ఆంధ్రజ్యోతి విషయంలో కూడా చేశారు.

**నార్ల:** అంటే నీ ఉద్దేశం?

**మధుర:** పాటిమానికా తెల్లబియ్యముా మీరు వెళ్ళాకే ఆ పత్రికలు అన్నీకూడా బ్రహ్మాండంగా పెంచుకున్నాయి సర్క్యులేషన్లు-

**నార్ల:** నేను న్యూస్‌కోసం ప్రకటనల్ని పీకించేసేవాడ్ని. నేను స్టౌన్ దగ్గరుంటే మేనేజర్లు గడగడలాడేవారు.

**మధుర:** మీ రెంతసేపూ మీ ఇమేజికోసం చూసుకున్నారేగాని యజమాని బాగోగులు పట్టించుకోలేదు. ధనికులు మీకు అండగా వున్నా, వారికి మీరు అడ్డంగా తయారయ్యారు.

**నార్ల:** యజమానుల చేతుల్లో పత్రికలు ప్రజలపక్షం వహిస్తున్నట్లు నటిస్తూ వ్యాపార వర్గాల కొమ్ముకాస్తాయి. అదే మనదురదృష్టం. వారి డబ్బు వాడుకోవాలిగాని వారికోసం పనిచేయరాదు.

**మధుర:** ప్రసాద్ గారికి కూడా మీరు వయి టెలిఫెంటే అయ్యారు. మిమ్మల్ని ఆయన అన్నగారికంటె ఎక్కువగా గురువులా ఆరాధించారు. అవునా?

**నార్ల:** నా స్వర్ణోత్సవానికి పోగుచేసిన విరాళాలకు సరైన లెక్కచెప్పలేదు అతగాడు.

**మధుర:** తప్పు. మీకోపం మీకు తెలీదు. మీది కక్షసాధింపు తత్వం. అరవైవేలకు పైగా మిగిల్తే మీ సొమ్ము మీకిచ్చేసి రశీదు తీసేసుకున్నాడాయన. కర్చులన్నీ కమిటీ ప్యాస్ చేసింది.

**నార్ల:** మా గొడవలన్నీ నీకెల్లాతెలుసు?

**మధుర:** ఆయనే ఒక కాపీ మాకు కూడా, అంటే నాకూ గిరీశంగారికీ, యిచ్చారు. తెలుసుకోండంటూ, మీ యాగీ భరించలేక.

**నార్ల:** ప్రసాద్ నన్నుచాలా హర్ట్ చేశాడు.

**మధుర:** మీరాయన్ను అంతకంటే మాటల్తో, ఉత్తరాల్తో కుళ్ళబొడిచారు. మీరేం తక్కువా?

**నార్ల:** నువ్వు కూడా నియో రిచ్‌క్లాసు పక్షం వహించి మాట్లాడుతున్నావు. ప్రజల పక్షం కాదా నువ్వు?

**మధుర:** మీరు కాంగ్రెసుని వ్యతిరేకించారు - ఇందిరా కాంగ్రెస్ అంటే పడదు. కమ్యూనిష్టులను మునుపే వ్యతిరేకించారు. చివరకు ఎన్.టి. ఆర్‌ని ఆశ్రయించాల్సిన గతి పట్టింది మీకు; కులతత్వం లేకపోయినా.

**నార్ల:** నేను ఆంధ్రజ్యోతిని ఎవరికీ గొడుగుపట్టే పత్రిక గాకుండా నాపత్రికగా తీర్చిదిద్దాను. ఇందిరా కాంగ్రెసుని మట్టి కరిపించినందుకు నేను ఎన్.టి. ఆర్‌ని అభిమానించాను; వృత్తినేకాదు.

**మధుర:** ఎన్.టి. ఆర్‌కు చెప్పి అకాడెమీలని రద్దు చేయించడం శాడిస్టిక్ చర్యకాదా?

అయినా మీరు ఎడిటరే కాని పండితులూ కవీ కారుగదా బెజవాడ గోపాలరెడ్డి గారు అన్నట్లు.

**నార్ల:** బెజవాడ గోపాలరెడ్డి మీద కోపంతోనే అలా చెయ్యాల్సివచ్చింది.

**మధుర:** కోతి పిల్లిచేత పొయ్యిలో పనసగింజలు తీయించినట్లు అయింది చివరకు.

**నార్ల:** (నవ్వి) స్ట్రాట్ ఫర్డ్ ఆన్ ఆవన్, షేక్స్పియర్ జన్మస్థలంలో ఆయన విగ్రహం మధ్యన పెట్టి చుట్టూ షేక్స్పియర్ మహాకవి నాటకాలలో పాత్రల విగ్రహాలను నిలబెట్టి షేక్స్పియర్ పార్క్ కట్టారు. అలా గురజాడనూ నిమ్నూ మధ్యన నిలబెట్టి కన్యాశుల్కంలోని పాత్రలతో ఓ కన్యాశుల్కం పార్క్ ప్రతివూళ్ళోనూ నిర్మించాలి.

**మధుర:** మీరు ఐడియాపురుషులే, కాస్త బుద్ధివంకరగాని, పోనీ సెనిలిటీ అనుకోండి చివరికి.

**నార్ల:** నీకు ఎందుకో నామీద సదభిప్రాయం లేనట్లుంది.

**మధుర:** మీరు యాంటీ నాచ్ కదా! గురజాడ, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారూ యాంటీనాచ్కారు. ''వేశ్యాకులం ఎందుకోసం పుట్టింది'' అని చక్కని వ్యాసం రాశారు, మహానుభావులు. ఆయన్నేదో అన్నారట మీరు..(నవ్వు)

**నార్ల:** ఆయన పంచెలో షర్టుదోపి పైన కోటు వేసుకునేవారు. 'తెలుగుకథకుల్లో కోటీశ్వరుడు మీ రొక్కరేనండీ' అన్నా.

**మధుర:** దాని కాయనే వన్నారు?

**నార్ల:** 'మిగతా దరిద్రుల మాట నన్నడక్కండి' అన్నారు.

**మధుర:** మీరున్నకాలం కూడా అల్లాటిది. మీరు సాహిత్య కళా రాజకీయ తదితర రంగాలన్నిటా 'జయింట్స్' మధ్యవున్నారు. ఇప్పుడంతా లిల్లిపుట్స్.

**నార్ల:** ఈ మాట ఒప్పుకున్నావుగదా! నాపేచీ అంతా ఏమోరల్స్ లేని పరిపాలకులూ రాజకీయాలమీదే.

**మధుర :** ప్రజాస్వామ్యం పోయి అగ్లీ ధనికస్వామ్యం వచ్చింది. నేటి దినపత్రికలూ రాజకీయ పార్టీలూ; ఆశయాలలో భేదాలవల్ల విడిపోవడంకాక, నిస్సిగ్గుగా కులాల వారీ వర్ధిల్లుతున్నాయి. వార్తల్ని అమ్మకపు దృష్టితో రాయిస్తున్నారు. ప్రకటన కర్తల శాసనం పత్రికల మీద చెల్లుతోంది.

**నార్ల:** దీన్నే మార్కెట్ ఎక్స్పాన్షన్ అంటున్నారు నకిలీ ఎడిటర్లు.

**మధుర:** జన్మలో పత్రికల మొహంచూడనివారు పత్రికలు పెట్టి అగ్రశ్రేణిలో వర్ధిల్లుతున్నారు కదా! దీన్ని మీరేమంటారు?

**నార్ల:** డబ్బు పెట్టి అన్నీ కొనగల్గుతున్నారంటాను. ఏ విలువలూ లేని వినియోగదారుల సమాజం వచ్చింది. సంస్కృతి, కళలు, సాహిత్యం వేటితో దానికి అనుబంధంలేదు. మన మధ్య తరగతి కూడా అమెరికనైజ్డ్ అవుతోంది పూర్తిగా.

**మధుర:** గిరీశంగారు అమెరికా వెళ్ళి పోతారట.

**నార్ల:** గిరీశంలాంటివారు అక్కడ లేరాయేమి?

**మధుర:** గిరీశంగారు ఎడిటరయితే -

**నార్ల:** గిరీశాలూ వెంకటేశాలూ ఎడిర్లయితే పూటకూళ్ళమ్మ పబ్లిషరవుతుంది.

**మధుర:** అంతకంటె ఏమీరానివాళ్ళు పత్రికా సామ్రాజ్యాన్ని ఏలుతుండగా గిరీశాని కేమి లోటువచ్చింది?

**నార్ల:** నువ్వు చెప్పింది అక్షరాలానిజం. కొత్తగా పత్రిక పెట్టిన ఒక శ్రీమంతుడు ''ఎడిటోరియల్స్ సంపాదకుడే ఎందుకు రాయాలి?'' అన్నాడ్ట. కాలేజీ మాస్టర్ల చేత సినిమా రైటర్స్ చేత ఎవరిచేతపడితే వారిచేత రాయిస్తాను ఎడిటోరియల్స్ అని అలాచేశాడ్ట!

**మధుర:** ధనికస్వామ్యం ప్రతిదాని Sanctity (అంటె పవిత్రతను) ధ్వంసం చేసి ఆనందిస్తుంది. అది దాని శాడిజం.

**నార్ల:** బైబిల్లో సూక్తివినలేదా?

**మధుర:** ఏవిటిది?

**నార్ల:** సూది బెజ్జంలోంచి ఒంటె దూరిపోగలదుకాని భగవంతుని సామ్రాజ్యంలోనికి ధనవంతుడు ప్రవేశింపజాలడు.

**మధుర:** సెక్సు అమ్ముతుందంటే సెక్సు, షేర్లు అమ్ముతాయంటే షేర్లు, రాజకీయాల మ్ముతాయంటే రాజకీయాలు, సినిమా అమ్మితే సినిమా, ఏది అమ్ముడయితే అది ప్రచురించే పత్రికలు వచ్చి ప్రజాస్వామ్యాన్ని ధనస్వామ్యంచేశాయి.

**నార్ల:** అందుకే నాలోపాలు కోపాలు ఎలాటివయినా. నా తదనంతరం నా రెలవెన్స్ అధికమయింది, అది నువ్వు తెలుసుకో

**మధుర:** భోజన సందర్భంలో మీకు యిష్టమైన ఆధరువులు ఏవిటి?

**నార్ల:** కాల్చిన వంకాయపచ్చడి, పచ్చిపులుసు; ఇవంటే నాకు మహాయిష్టం. బంగాళాదుంప, పచ్చిబటానీ, టొమాటో, క్యారెట్ మొదలైనవి ఎక్కువ రుచిగలవైనా అవి తింటున్నపుడు తృప్తి తప్ప రియాక్షన్ రాదు. ఇవన్నీ ఎందుకిప్పుడు?

**మధుర:** మీ ఎడిటోరియల్స్ ఒకప్పుడు అల్లాగుండేవి. మరి మీ గ్రీవియన్స్ ఏవిటి?

**నార్ల:** మహాకవినని, మహా రచయితనని ఇచ్చకానికైనా నన్ను మెచ్చుకున్నవారు లేరు. నా ప్రొఫెషన్‌లోని వాళ్ళే నన్ను కించపరచారు కావాలని.

**మధుర:** మీకు బాగా నిద్రపడుతుందా? అదే; మీ ఆరోగ్యం బావుండేదా అని!

**నార్ల:** అదేమి పాపమో, నాకు త్వరగా నిద్రపట్టదు. ఒకసారి పట్టినా ఒకపట్టాన మెలుకువరాదు. అదీ ఓ ఆరోగ్యమేనంటాను.

**మధుర:** ఎవరి బలహీనతల్ని వారు సమర్థించుకుంటారని గిరీశంగారు అనేవారు. మీరు పరధ్యాసను కీర్తించారు. మీకు అది ఎక్కువా?

**నార్ల:** ఆలోచనాపరులకి ఏకాగ్రత ఒక Virtue. ఒక విషయం మీద మనస్సు ఏకాగ్రంగావుంటే ఇంకోదాని మీద శ్రద్ధ తక్కువవుతుంది. దాన్నే నువ్వు పరధ్యాస అంటున్నట్టుంది... నిజానికి నాకు పరధ్యాస తరుచుగా సంభవించేదే. సిగరెట్ ముట్టించిన వెంటనే పరాకుగా పారవేసి కొత్తదాన్ని ముట్టించడం, కాల్చుతున్న సిగరెట్టుతో కట్టుగుడ్డలు కాల్చుకోవడం నాకు చాలాసార్లయింది. తిండి తినిందీ తిననిదీ తరచు జ్ఞాపకం లేకపోవడం నాకు చాలాసార్లయింది. కొన్న గంటలోపల గొడుగుపారవేయటం, రోజున్నరలోపల ఫౌన్‌టెన్ పెన్ జారవిడవడం నా రికార్డు. పోస్టుబిళ్ళలను డబ్బాలోవేసి, ఉత్తరాన్ని వెనక్కి భద్రంగా తెచ్చిందిమాత్రం ఒక్కసారే.

**మధుర:** పోయిన నిన్న గురించి, పుట్టని రేపుగురించి దిగులు పడక నేటి మాధుర్యాన్ని నేడే గ్రోలాలి. మీరు కలుపుగోలుగా వుంటారా?

**నార్ల:** పలకరిస్తేనే తప్ప పలక్కపోవడం నాకు పరిపాటి. ఇంగ్లీషు చదువులవల్ల కొన్ని ఇంగ్లీషు సంప్రదాయాలు వంటబట్టడం యిందుకు కారణం కావచ్చు.

**మధుర** : మీరు నాస్తికులూ భౌతికవాదులూ కావడంవలన మీరు నిర్వహించిన పత్రికలు నష్టపోయాయంటారు.

**నార్ల:** అయినా నేను సంస్కృతికి దూరం కాలేదు. నా భావాలు కొన్నిటిని మాత్రం నాకే పరిమితం చేసుకున్నాను.

**మధుర:** మీ పేర ఒక స్టడీసెంటర్‌ని నెలకొల్పాలని తెలుగుదేశం ముఖ్యమంత్రి ఒక రాయిపాతారు, హుస్సేన్‌సాగర్ బుద్ధపూర్ణిమ ఘాట్‌వద్ద. అది ఏమయింది?

**నార్ల:** బుద్ధునికే గతిలేదు. ఇక నా సంగతీ గతీ విచారించే వారెవరు?

**మధుర:** మీరు ఎడిటర్ గదా - పత్రిక విజయవాడలో వుండగా అక్కడ్నుంచి బిచాణా ఎత్తేసి బంజారాహిల్సులో 'లుంబిని'కి వచ్చేసారుట అవునా?

**నార్ల:** 'లుంబిని' నేను కట్టుకున్న యిల్లు. సొంత యింట్లో వుండాలని ఎవరికి అనిపించదట?

**మధుర:** అదే మీరుచేసిన పెద్దపొరపాటు. మీరు లేకుండా పత్రికవస్తుందని యాజమాన్యానికీ సిబ్బందికీ రుజువుచేశారు. ఇక ఎడిటర్ ఒకవయి టెలిఫోంటే కదా -

**నార్ల:** నా జీవితం చరమాంకం అంతా ఫ్రస్ట్రేషన్‌తో గడిచింది. బాల్యంలో గూడా చాలా బాధలు పడ్డాను. స్వంతంగా కష్టపడి నాస్థితిని నేనే సాధించుకున్నాను.

**మధుర :** ఉద్యోగ విరమణ గూడా సంతోషంగా జరగలేదుగా?

**నార్ల:** మేం చేసింది ఉద్యోగంకాదు. నడిపింది ఉద్యమం. మా సేవల్ని ఎవరూ రూపాయ అణాపైసల్లో, కొలవజాలరు.

**మధుర:** ఇప్పుడు జరుగుతున్నది అదే లెండి. అప్పుడు గనక అలా జరిగింది; - ఈ ఎలక్ట్రానిక్ యుగంలోని జర్నలిజాన్ని చూడకుండా వెళ్ళిపోయిన మీరు ధన్యులు. ★

*(మిసిమి - అక్టోబరు, నవంబరు, 1992)*

# అబ్బూరి వరదరాజేశ్వర రావుతో



కన్యాశుల్కం నాటక ప్రదర్శనకు 'నటాలి' మధురవాణి పాత్రకు ఇంట ర్వ్యూ నిర్వహిస్తోంది. చాలామంది నటీమణులు తమ అభినయాన్ని చూపించి వెళ్తున్నారు. నిజ మధురవాణి సైతం ఆ పోటోలో పాల్గొం టుంది చమత్కారంగా...

**వరద:** నిజ మధురవాణీ కంగ్రాట్సు. ఇది వరకు చార్లీచాప్లిన్‌కు కూడా ఇటువంటి మర్యాద జరిగింది. చార్లీచాప్లిన్ వేషం వేసి నాయనకు ఫస్టుప్రయిజూ, ఛాప్లిన్‌కు రెండవ ప్రయిజు వచ్చింది.

**మధుర:** చౌకబారు రచయితలు మహాకవులు లాగా చెలామణీ అవుతుంటే మీలాటివారు నిశ్శబ్దంగా సహించి వూరుకోవడం ఏమీ బాగాలేదు.

**వరద:** ఫామిలీ ప్లానింగ్ పెట్టినట్లే కవిత్వాలు ఎక్కువగా రాసే జబ్బు వున్నవాళ్ళకి దోయాతీన్ బస్ అనే రూలు పెట్టాలి.

**మధుర:** (నవ్వి) మహాత్ముడిని మీరు చూశారా?

**వరద:** 1929లో మహాత్ముడు బెజవాడ వచ్చారు. తన ఖద్దరు నీధికి తోడ్పడమని అన్నారు. వేదిక దగ్గరకు వెళ్ళి నా ఉంగరాన్ని మహాత్మునికిచ్చాను. 'నాకిమ్మని నీకెవరు చెప్పారు' అని వారు ప్రశ్నించారు. 'నాకెవరూ చెప్పలేదు. నా అంతట నేనే ఇస్తున్నానని అన్నాను. మహాత్ముడు నన్ను చేరదేసి 'పిల్లలుభగవత్స్వ రూపులు' అన్నారు. ఆ ఉదంతం అప్పటి ఆంధ్రపత్రికలో అచ్చయింది.

**మధుర:** మీరు భగవంతుడ్ని ఎప్పుడు శంకించడం ప్రారంభించారు.

**వరద:** మా మేనత్త బియ్యం చెరుగుతున్నప్పుడు ఓ పద్యం అతి నాజూగ్గా చదవడం విన్నా. తరువాత మా అత్తయ్య చదివిన పద్యం రాసిన ఆయన విశ్వనాథ వారని తెలుసుకున్నా.

**మధుర:** చిత్రం చిత్రం మహాచిత్రం పరమ ఆస్తికులైనా విశ్వనాథ వారి పద్యం భగవంతుడు ఉన్నాడా లేడా అని శంకించేలా చేసిందా? ఏవిటి ఆ పద్యాలు?

**వరద:** (ఆలపిస్తాడు) నా కనుల యెట్టయెదుట నా జనకుని
నా జనని కుత్తుకల గోసి నన్నడిగె
నతండు 'నే దయాంబుధినికాదా' యటంచు
ఓ ప్రభూ! అగునంటి నే నొదిగియుండి.

నా కనుల యెట్ట యెదుట నా లతాంగి
ప్రాణములు నిల్వునందీసి యడిగె నను న
తండు 'నేదయాంబుధిని కాదా' యటంచు

**అబ్బూరి వరదరాజేశ్వరరావు**

ఓ ప్రభూ! యగునంటి నే యొదిగి యొదిగి
నా కనుల యెట్టయెదుట నా యనుంగు
తనుజు కుత్తుక నులిమి తా నడిగెన
తండు 'నేదయాంబుధిని కాదా' యటంచు,
ఓ ప్రభూ! నీవయంటి నే నొదిగి పోయి.

**మధుర:** వచన పద్యం మీకు నచ్చుతుందా?

**వరద:** వచన పద్యమేమిటి మిల్లు ఖద్దరులాగ.

**మధుర :** మీ నాన్న గారి మంగళసూత్రం కథలో ఇతర వ్యాసాలలో అంతర్వాహినిగా ఒక చిన్న విషాదపుజీర ప్రవహించేది. అది ఏమిటి?

**వరద:** మా చిట్టి చెల్లెలు సుజాత వ్యాధిపీడితురాలయి పోయింది. ఆ విషాదం నుంచి వెంటనే మేమెవ్వరం కోలుకోలేదు. నేను పద్యాలు కూడా రాశా!

నాన్నగారి వేదాంతము నెన్నిసార్లు
వినుచు నోపికపట్టగలవని తలచి
స్వామి గుడి వాకిలిం జేరి ప్రార్థనమ్ము
చేసినా నొకమారు నాచెల్లి కొరకు

ఈ పద్యాన్ని సత్యనారాయణ గారు మెచ్చుకున్నారు

**మధుర:** కవి కుమారుడు కవి కుమారుడే అవుతాడు. మీరు పండిత పుత్రులు కాలేదు.

**వరద:** ''నీవు విసరిన పూలమాలిక దైవ సన్నిధి చేరలేక
అపుమాపుము ఆర్తనాదము, ఆలయమునకె పోదము'' అని నేను స్కూల్లో చేరక ముందు రాస్తే పురిపండా, శ్రీశ్రీ అంతాడంగైపోయారు నాధాటికి. మొదట నన్ను అడ్మైర్ చేసి నన్ను చివరి దాకా ఫాలో అయినది మిసెస్ ఏ.వి.ఎన్. కళాశాలకు అనుబంధంగా వుండే స్కూల్లో సహ విద్యార్థి రాచకొండ విశ్వనాథ శాస్త్రి.

**మధుర:** మీనాన్నగారి వల్ల మీ యిల్లు ఒక కవుల ట్రాఫిక్ ఐలండులా వుండేదనుకుంటా!

**వరద:** పురిపండాగారి ఖాదీ భాండార్ ఒక ట్రాఫిక్ సాహిత్య జంక్షన్ అయితే మా యిల్లు ఆధునిక కవులకి ఒక కూడలి. యూనివర్సిటీ సంగతి సరేసరి. మూడవ పీఠం, బిరుదు పిండప్రదాత బుర్రాశేషగిరి రావు గారిది, ఆంధ్ర భారతీతీర్థం. ఆ సంస్థస్నాతకోత్సవం విశాఖపట్నంలో జరిగింది. అక్కడికి పురిపండా, శ్రీశ్రీ, తురగా వెంకట్రామయ్య వగైరా నన్ను తీసుకెళ్ళి నాచేత నా అముద్రిత నాటకం 'తపోభంగం' చదివించారు. రతీమన్మథుల కథ అది. అంతా శిష్టవ్యవహారికం. నాముందు కూర్చున్న తెలుగు మాస్టారు గిడుగు రామమూర్తి పంతులుగారు. నానాటకం వ్రాతప్రతిని పంతులు గారు చూసి అక్కడక్కడ సరిచేశారు. ఆయన పరిచయ ప్రభావం వల్లనేను పరీక్షల్లో వ్యాకరణం ప్రశ్నలు ముట్టుకునే వాడ్ని కాదు.

**మధుర:** మీ మొదటి కథ ఎప్పుడు అచ్చయింది?

**వరద:** జ్వాల 1934 నవంబరు సంచికలో ప్రథమ యుద్ధం కథపేరు.

**మధుర:** మీరెవ్వరికీ సాధారణంగా నమస్కారం చెయ్యరని విన్నా.

**వరద:** దువ్వూరి రామిరెడ్డి గారికి చేశా, ఆయన పద్యాలంటే ప్రాణం.

**మధుర:** ఇంతకీ మీది ఏ పార్టీ.

**వరద:** 1940 జూన్‌లో రాడికల్ డెమాక్రాటిక్ పార్టీని ప్రారంభించాం. మా పార్టీలో మిసిమి ఆలపాటి రవీంద్రనాథ్ గారు కూడా వుండేవారు.

**మధుర:** అన్నట్లు సంపంగితోట ఎవర్రాశారు? తరువాత చాలా మంది వాటాకు తయారయారు, ఎందుకు?

**వరద:** నేను, శ్రీశ్రీ. మాతో బాటు శ్రీరంగం నారాయణ బాబూ పనిచేశాడు. శ్రీరంగం నారాయణ బాబుకి సంపెంగ తోట కర్తృత్వంతో ఏమీ సంబంధం లేదు. దానికి మ్యూజిక్ బాలాంత్రపు రజనీకాంతరావు చేశాడు.

**మధుర:** మీకు సూతాశ్రమం తెలీకుండా వుండదు.

**వరద:** నటాలిని చీరాలనుంచి తెనాలికి మార్చాం. సూతాశ్రమంలో గోపీచందూ ఆయన తమ్ముడు గోకుల్ చందూ వుండేవారు. పి.వి.సుబ్బారావూ, మద్దిపట్ల సూరీ, బైరాగీ నేనూ కలిసేవాళ్ళం. గాంధీ చౌకుదగ్గర గుడ్‌విల్ అండ్ కో అని వుండేది. ఆదుకాణంలోకి సాయంత్రం నాలుగవగానే మాధవ పెద్ది బుచ్చి సుందర రామశాస్త్రి వచ్చేవారు. గాంధీ చౌకులో మరో దుకాణానికి చక్రపాణి వస్తూవుండేవాడు. అక్కడికే ధనికొండ హనుమంతరావు కూడా వచ్చేవాడు.

**మధుర:** మాయసుందరి గొడవేమిటి? అన్నట్లు మీకెవరో చిన్నపుడే సాష్టాంగపడ్డాడట ఆ విశేషం?

**వరద:** వాడా? శిష్ట్లా ఉమామహేశ్వరరావు. నన్ను చూసి నేలమీద పడ్డాడు. నవమి చిలుక అదీరాశాడు. ఎక్సెంట్రిక్ ఫెలో - హెరాల్డు బ్రిగ్‌హవుస్ ఇంగ్లీషులో రాసిన 'ది ప్రిన్స్‌హువజ్ ఎఫైపర్' అనే నాటకాన్ని 'ప్రతిమా సుందరి'గా అనువాదం చేశా. ఇదంతా గుంటూరులో. కూర్మావేణుగోపాలస్వామి నాయుడుగార్ని రిహార్సల్సుకి తీసుకొచ్చానేనే. చీటికీ మాటికీ స్టేజి వెనకాలకి వచ్చి ఎవరికీ సంబంధించని సూచనలు యిచ్చేవారు. నేను ఆక్షేపణ చెప్పా. మాయా సుందరి అని పేరు మార్చి అదే నాటకాన్ని నాట్య సమితి చేత వేయించడం ప్రారంభించారు. నా పేరు లేదు.

**మధుర:** ఇదేమి ఛాంచల్యం?

**వరద:** అప్పుడు బెజవాడలో మల్లాది వారి అధ్వర్యంలో ప్రతిమాసుందరి అచ్చయి రిలీజయింది. నటాలి అధ్వర్యంలో మానాన్నగారి పర్యవేక్షణలో రెండు వందల నలభై సార్లు తెలుగు దేశం అంతటా ప్రదర్శించారు.

**మధుర:** వర విక్రయంలో సింగరాజు లింగరాజు వేసిన బలిజేపల్లి లక్ష్మీకాంతం గారు మీకు తెలుసా?

**వరద:** మానాన్నగారంటే ప్రాణం, మదరాసులో కన్యాశుల్కం వేసినపుడు అగిహోత్రావధాన్లు వేసి అమోఘంగా నటించారు. నేనూ, లక్ష్మీకాంతంగారూ, శ్రీశ్రీ, నళినీ కుమార్ (పూర్వం ఉండవల్లి సూర్యనారాయణ ఆఫ్ విజయనగరం ఫేమ్ లక్ష్మీ కాంతంగారి మేన కోడలు డ్యాక్టర్ వరం తరచు కలిసి తిరిగెవాళ్ళం మాంబళం వీధుల్లో.)

**మధుర:** ఇలా రోడ్ల మీద తిరగటమేనా, యింకేమైనా చేశారా?

**వరద:** మొదట ఆంధ్రప్రభలోనూ తర్వాత ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లోనూ సబ్బింగ్‌చేశాక మదరాస్ వార్‌రెవ్యూ అసిస్టెంటు ఎడిటర్‌గా వెలగబెట్టా. శ్రీశ్రీ నేనూ వారం వారం కలిసే వాళ్ళం. శిష్టి, జరుక్ శాస్త్రి వస్తూండే వారు. నేనప్పుడే రుక్కుటేశ్వర శతకం అని ముప్పయ్ పద్యాలు రాసి శ్రీశ్రీ కిచ్చా. వాడెక్కడో పారేశాడు.

**మధుర:** శ్రీశ్రీ కవిత్వానికి ఒక పత్రిక పెడతానన్నార్ట?

**వరద:** పత్రిక ముఖ పత్రం మీద చెళ్ళ పిళ్ళ వేంకటశాస్త్రి గారి అరచేతుల్ని ముద్రిస్తాననేవాడు. ఆయన వేళ్ళు బాగా కనపడాలన్నాడు. ఇద్దరం కడియం వెళ్దామనుకున్నాం. ఇద్దరి దగ్గరా డబ్బుల్లేవు, ధ్వని దాని పేరు.

**మధుర:** (నవ్వి) తరువాత 'కవిత' పెట్టింది మీరేగా?

**వరద:** నేను, రాయప్రోలు రాజశేఖరు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, బెల్లంకొండ రామదాసు, అజంతా మాతోపాటు శ్రీశ్రీ. ఒకకొత్త మలుపు తేవాలని ఉబలాటపడ్డాం. మల్లాది రామకృష్ణ శాస్త్రిగారు చాలా సంతోషించారు. విశ్వనాథ వారు కవితకు తప్పకుండా రాస్తామన్నారు. సంవత్సరానికి మూడుసార్లు విడుదల చెయ్యాలని.

**మధుర:** కవితకు సంపాదకీయం మీరురాశారా, నాన్నగారా?

**వరద:** స్వవిషయ సూచిక అని ఆస్కార్‌వైల్డ్ పిక్చర్ ఆఫ్ డోరియన్‌గ్రేకు రాసినవి అనువాదం చేసి తొలిపుటలో వేశాం. రామణీయకాన్ని సృష్టిస్తాడు కళాస్రష్ట, నీతికరం, అవినీతికరం అంటూ గ్రంథాలు లేవు; బాగా వ్రాసిన పుస్తకాలూ, బాగా వ్రాయని పుస్తకాలూ, అంతే-

**మధుర:** కవులకొటేషన్లు పట్టు కుంటే కుక్కతోక పట్టుకుని గోదావరి ఈదినట్లు వుంటుంది. అతనేగదా యావత్కళా నిష్ప్రయోజనకరం అంది. కళ విలువను నిర్ణయించాల్సింది దాని రామణీయకతను బట్టికాదు, ఋజుమార్గ ప్రవర్తనను బట్టి అని అతనేగా అన్నాడు?

**వరద:** టి.యస్. ఇలియట్ వాక్యాలు కూడా కొన్నివేశాం. సరిహద్దులను కరిగించడమే కవిత్వం మాహాత్మ్యం. శ్రీశ్రీ 'నగరంలో వృషభం' తొలిప్రచురణ కవితలోనే. ఆరుద్రగుమాస్తా ప్రేమగీతం, అజంతా ప్రసిద్ధమైనచెట్లుకూలుతున్న దృశ్యం, తిలక్‌గొంగళిపురుగు, పఠాభి మాత్రాఛందస్సులు అచ్చయింది అందులోనే.

**మధుర:** మీరు నిజంగా పెద్ద సారువారు. మీరుజైల్లో వున్నారట- గిరీశం గారిలా గొడవల్లోపడి నలిగిపోలేదు కద!

**వరద:** రాజకీయఖైదీగా జులై 1948లో రాజమండ్రి సెంట్రల్‌జైల్లో నిర్బంధంలో వున్నా.

నాపూర్వజీవితాన్నీ హైదరాబాద్ అనుబంధాల్నీ శంకించి నన్ను నిర్బంధంలో వుంచి నాచేత ఆధునిక ప్రారంభకావ్యం 'చిరకాలం' రాయించారు.

**మధుర:** ఏమిటి కథ?

**వరద:** జైల్లో ఉరికోసం నిరీక్షిస్తూన్న ఒక ఖైదీ వుంటాడు. అతను కట కటాల మధ్యవున్నా నిరంతరం మృత్యుసన్నిధిలో వుండేవాడు. అతను నిరపరాధి నని చెప్పుకుంటూ తనపై అధికారులు మోపిన నేరం గురించి చెప్పేవాడు. తనకెలాగూ చచ్చిపోవాలనివుంది. తనపై ఆరోపించిన నేరం గురించి బాధ పడేవాడు. అప్పటి రాజకీయ పక్షాలన్నిటిలో పనిచేశాడు. ఎవరూ తనక్కావలసిన సహాయం చెయ్యలేకపోయారు. నిరుద్యోగంలో, కఠిన దారిద్ర్యంలో - కుటుంబం భార్యాపిల్లలూ ఆకలికి తట్టుకోలేకపోయారు. అందరూ కలిసి ఆత్మహత్య చేసుకుందామనుకున్నారు. కత్తితో పొడుచుగున్నప్పుడు పోలీసులు వచ్చి పట్టుగున్నారు. అదీ అతని కథ. ఈ ప్రపంచంలో తనకు ఆధారం లేనపుడు ప్రపంచాన్ని వదిలేసి పోవటానికి తనకు హక్కులేదా అని అతని వాదన! ఇక్కడే బాగుంది, బయట బాధే బాబూ, మాలాటి వాళ్ళు కనేవాడు.

**మధుర:** చిన్న ఆశాకిరణం కూడా లేని జీవితాన్ని కవులు చిత్రించడం న్యాయమా? నిరాశామయ లోకంలో కదన శంఖం పూరిస్తున్నానన్నాడు మీ పేదలకని.

**వరద:** కలకాలం చెరకాలం

సిలువై తుది కావ్యమై స్పృశించెను వరదా! అన్నాడు శ్రీశ్రీ. తన తోపాటు తీసుకెళ్ళి నావ్రాత ప్రతిని ఎక్కడో పారేశాడు మావాడు.

ఒకసారి అందులో కొన్ని ఖండికలు తెలుగు స్వతంత్రలో గోరాశాస్త్రి ప్రకటించాడు. ఏవో పోగుచేసి 'అందాక' అని అచ్చువేశా.

**మధుర:** తిరిగి మళ్ళీ రాయమని ఎవరూ బలవంతపెట్ట లేదా?

**వరద:** అందులో చాలా వరకు సంప్రదాయ ఛందస్సు వాడా. నాకే, అంతా అడిగినా; మనస్కరించక రాయలేదు. అది రాసినపుడున్న దృష్టివేరు. చాలా వరకు రాసింది వ్యవహారిక భాష. మాత్రాఛందస్సుల ముత్యాల సరాలు కూడా వున్నాయి.

**మధుర:** మరి మీ స్నేహితులంతా ఛందస్సుల మీద విరుచుకు పడతారేం?

**వరద:** రాయటం రాక. తెలుగువాడి ఆస్తి తెలుగు పద్యమే గదా! కృష్ణశాస్త్రిగారు కూడా అభినందించారు. ఒకటి గుర్తు.

కారుమబ్బు వానకారు, వాగులుపొంగు
నిండి నదులు, వరద నింగి కెగసి
వాన లోన నీవు వాన కావల నేను!
అంతె బతుకు, చివరికంతె అంతె

**మధుర:** వానలోన నేను, వాన కావల మీరు చాలా గొప్పగా అన్నారు. మీరు పండిత నెహ్రూని ప్రెస్ మీట్‌లో కంగు తినిపించారట.

**వరద:** నెహ్రూగారు ప్రజాస్వామ్యపాదుషా. స్వాతంత్ర్యం కోసం పోరాడిన నెహ్రూవేరు, ప్రధాని నెహ్రూ వేరు. అడిగా, దేశమంతటా పర్యటిస్తున్నారు గదా కాంగ్రెస్ విజయావకాశాల గురించి మీ అంచనా ఏమిటి? అని. ఏవో ఒకటి రెండు చోట్ల తప్ప మొత్తం మీద కాంగ్రెసు విజయదుందుభి మ్రోగిస్తుంది, అన్నారు. ఒకటి రెండు చోట్ల మాత్రం కాంగ్రెసు ఎందుకు ఓడిపోవాలి అని అడిగా. దీనికి తికమకపడి జేబులోంచి సిగరెట్ తీసి ఒకటి ముట్టించారు. గాంధీ టోపీ తీసి తలతడుముకున్నారు. కాంగ్రెసు ఎందుకు ఓడిపోతుందంటే ప్రజలు తెలివైనవారు కాబట్టి అన్నారు. అంటూ ఆయన నవ్వేశారు. రెండో ప్రశ్న. కాంగ్రెసులో అవినీతి పెరిగిపోయిందని వినవస్తున్నది. దీనికి మీరేమంటారు అన్నా, నెహ్రూ జవాబు ఈ కూత కూసింది ఎవరు? కాంగ్రెసులో అని నీతి ఉందనడం అసంబద్ధ ప్రేలాపన. నిజానికి అవినీతి విషయంలో ప్రతిపక్షాలు పరమ అధ్వాన్నం. అని ఆయన కోప్పడ్డారు విరుచుకుపడి. నాకేసి తిరిగి మిస్టర్ నీ ప్రశ్న నాకు కోపం తెప్పించింది. నాకోపం నీ మీద కాదు అన్నారు.

**మధుర:** నెహ్రూగారు హైదరాబాద్ ది మిశ్రమ సంస్కృతి అనీ భాషా ప్రయుక్తరాష్ట్రాలుగా దాన్ని విడదీయడం తగదనీ గొడవ పడ్డారట ప్రెస్‌మీట్‌లో - ఏమాకథ?

**వరద:** నీవు చెప్పినట్లే సమ్మిశ్రిత సంస్కృతీ కేంద్రం అది అలాగే వుండాలన్నారు. మరి ప్రజలు భాషా ప్రయుక్త రాష్ట్రాలు కోరుతున్నారు కదా అని ఒకరన్నారు. 'ప్రజలు పొరబడితే దిద్దే బాధ్యత మనది' అన్నారు నెహ్రూ. ప్రజలంతా అలా కోరితే మీరు అనుమతించక తప్పదు కదా అని నేనన్నాను. అలాకుదరదు. ప్రతి తలుపూ తట్టి మీరు చేసేది మంచి పని కాదు అని నేను చెబుతా. హైదరాబాద్ రాష్ట్రాన్ని యథాతథంగా వుంచేట్టు ప్రయత్నిస్తాను అన్నారు నెహ్రూ. అప్పుడు నేను కొంచెం ధైర్యం చేసి 'అలా మీరు చేస్తే భారత ప్రధానికీ, వెనకటి నిజాంకు ఏమిటి భేదం' అన్నా. నెహ్రూ మొగం ఎర్రగా మారింది. బల్ల మీది సిగరెట్టు డబ్బా నేలకేసి కొట్టారు. నేను లేచి ఆడబ్బా తీసి ఆయన బల్లమీద పెట్టా, నావంక చూసి గట్టిగా నవ్వుతూ 'నేను చెప్పింది జాగర్తగా ఆలోచించు' అంటూ లేచారు. నేను పక్కన చేరి అన్నా! 'సమ్మిశ్ర సంస్కృతి ఏమైన ధర్మబద్ధమా?' అని. యింకా విపులంగా వివరించా నిజాం చేసినవి. తన ఉద్దేశం అది కాదనీ ఉన్న పరిస్థితి గురించి మాట్లాడుతున్నాననీ పండిట్‌జీ అన్నారు.

**మధుర:** అయితే హైదరాబాద్ నగర చతుశ్శతాబ్ది ఉత్సవాన్ని జరపాలంటారా? వద్దా?

**వరద:** ఈ నగరం వయస్సు నాలుగు వందలయితే అందులో రెండు వందల ఏళ్ళకు పైన అసఫ్‌జాహీ వంశస్థుల పాలనలో గదా యీ నగరం వుందీ! ఏనుగుల వీరాస్వామి గారి కాశీయాత్ర కూడా అప్పుడు జరిగింది. ఆయన ఆనాటి రాజకీయ పరిస్థితి కళ్ళకు కట్టేట్టు రాసి చక్కాపోయాడు. మతసామరస్యం అనేది దేవుడెరుగును. శాంతిభద్రత శూన్యం. ప్రజల దోపిడీ ప్రధానం. వారు తెలుగు భాషని ఆదరించారని డబ్బాకొట్టు కోవడం కంటితుడుపే. తెలుగు భాషకి సంస్కృతికీ ఏమీ ఉపకారం జరగలేదు. అసఫ్‌జాహీ వంశస్థులు అధికారంలోకి వచ్చినప్పటి నుంచీ జరిగింది తెలుగుకి అపకారమే. నగరంలో

మరీనూ. కమ్యూనిస్టులూ, కాంగ్రెసువాదులూ, యితర దేశభక్తులూ అసఫ్‌జాహీదుష్ట పరిపాలనకుస్వస్తపలికించేందుకు మహత్తరమయిన త్యాగాలు చెయ్యవలసి వచ్చింది. ఈ నగరానికి చతుశ్శతాబ్ది ఉత్సవం ఎలా చేస్తారో ఎదురుచూస్తున్నాం.

**మధుర:** కుహనాలౌకిక వాదులవల్లా వారి దురవగాహన వల్లా యిలాటి దిక్కుమాలిన పరిస్థితులు వస్తాయి. ఈ ఊరు కంపునీ దారుల్నీ బాగుచేసి, ట్రాఫిక్‌ను క్రమబద్ధం చేయక దిక్కుమాలిన ఉత్సవాలు ఎందుకు? ఇంతకీ భాగ్మతి అనే ఆవిడ వున్నట్టా లేనట్లా?

**వరద:** భాగ్మతిగా ఆవిడ్ని ప్రేమిస్తే ఆవిడ సంస్కారాన్ని గౌరవించక పాదుషా యీ వూరిని హైదరాబాదు అనడం ఏం కర్మ? చారిత్రకంగా యీ కథకు దాఖలాల్లేవంటారు విజ్ఞులు.

**మధుర:** శుభ్రంగా విజయవాడ, గుంటూరుల మధ్య వాంఛూ చెప్పినట్లు ఆంధ్రరాజధానిని కట్టుకుని వుంటే బాగుండేది? ఈ నిజాం బిల్డింగులు వగైరా విసర్జించిన దానికి ఎగబడి తెలుగు వినబడే చోట్ల కట్టుకోకుండా దిగబడ్డారు తెలుగువారు, దీన్ని రాజధాని అంటూ...

**వరద:** ఇక హైదరాబాధ వదిలేయ్.

**మధుర:** అకాడమీలు స్థాపించాలని మీనాన్నగార్ని అంకురార్పణ పనులు చేసిపెట్టమన్నార్ట పట్టాభి రామారావు గారు.

**వరద:** చదలవాడ పిచ్చయ్య ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ ప్రచార కార్యదర్శి, నార్లగారికీ మా నాన్నగారికీ హైదరాబాద్‌లో వున్న సాహిత్య వాతావరణం గురించి తెలీదు. అందుకని నన్ను సంప్రదించారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డాక ప్రకాశం గారిని దింపి నీలం సంజీవరెడ్డి గారు ముఖ్యమంత్రయ్యారు. ఆ తతంగంలో నాదీ వుంది కీలకపాత్ర.

**మధుర:** మీరు రామప్పంతుల్లా వ్యవహారాల్తో యమ బిజీగా ఉండేవారన్న మాట.

**వరద:** పబ్లిక్ రిలేషన్స్ మీద ఓ పుస్తకం రాశా. నేను బి.ఏ. ఆనర్సు తరువాత ఎం. ఏ. చేశా. ఆరుద్ర లాగ యఫ్. ఏ. కవినిగాను. దలైలామా తప్పించుకుని ఇండియా వచ్చినపుడు దలైలామా అండ్ ఇండియా, ఇండియన్ పబ్లిక్ అండ్ ప్రైమ్ మినిష్టర్ ఆన్ టిబెటన్ క్రయిసిస్ అనే గ్రంథాన్ని సంకలనం చేసి ప్రచురించా. 1958 నెహ్రూ గారి జన్మదిన సందర్భంగా మోడ్రన్ ఇండియన్ పొయిట్రీ - ఏన్ ఎంథాలజీ' అనే గ్రంథాన్ని సంకలితం చేసి నెహ్రూకి బహూకరించా. 'ఇండో ఆంగ్లియన్ పొయిట్రీ' కవిత క్రింద ప్రచురించా. అస్సామీస్ కవితా సంకలనం, షష్టిబ్రతా అనే బెంగాలీ కుర్రాడి పొయిట్రీ వేశాం.

**మధుర:** జాగ్రత్తగా ఉంటే గిరీశం గారు కూడా మీ అంత ప్రజ్ఞ ప్రతిభ కలవారు అయ్యేవారనుకుంటా. పూటకూళ్ళమ్మ దగ్గర చేరడం వల్ల అలా అయాడు కాని. ప్చ్!

**వరద:** నే నెక్కడ వాడెక్కడ. నీకతని మీద వున్న గురికి జాలిగా వుంది.

**మధుర:** మీరు విస్కాన్సిన్‌లో తెలుగు విజిటింగ్ ప్రొఫెసర్‌గా వున్నారట. అలాటి ఉద్యోగం మా గిరీశం గారికి వస్తే జమాయించేవాడు.

**వరద:** అప్పుడు తిరుపతి జి. యస్. రెడ్డిగారు, చేరాగారు అక్కడ ఉండేవారు. న్యూయార్క్‌లో మన మందుమిత్రుడు ఎ. ఆర్. కృష్ణ కేరాఫ్‌లో మన మకాం.

**మధుర:** సాహిత్యంతోనూ సాహిత్యేతర విషయాలతోను రాజకీయాలతోనూ రాజకీయేతర విషయాలతోనూ విద్యారంగంతోనూ మీకు సత్సంబంధాలున్నాయి. మీరు క్రికెట్‌లో ఆల్‌రవుండర్ లాటి వారు.

**వరద:** నేనేం కపిల్‌దేవునీ, సునీల్ గవాస్కరునీ కాను. నీ గిరీశాన్ని అంతకంటే కాను, నాకు బిరుదులక్కర్లేదు. సన్మానాలు అంతకంటే అక్కర్లేదు.

**వరద:** చాలాకాలం పీ.వీ. గార్కి, రాజీవ్‌గారి కాలంలో, మీరు పి. ఏ. గా వుండేవారట.

**వరద:** ఒకప్పుడు, ఇప్పుడు మా ఆవిడకు పి. ఏ.గా ఉంటున్నా.

**మధుర:** మీరు మల్లాది వారితో 'వరద రాజేశ్వరరావు అంత్యక్రియలు' రాస్తున్నానని చమత్కరించారట!

**వరద:** ప్రతిపాదాంతంలోనూ క్రియ వచ్చేట్లు చేశా, ఆరుద్ర కూడా చేశాడీపని. ఢిల్లీలో మా నాన్నగారి దర్శకత్వంలో 'కన్యాశుల్కం', 'మృచ్ఛకటికం' వేశాం. అప్పుడు నువ్వొస్తే బాగుండేది కదా!

**మధుర:** మీ నాటకంలో మధురవాణిగా నేను పనికొస్తానా?

**వరద:** అయిదు రోజుల పెళ్ళిలా జరిగిందా కార్యక్రమం ఢిల్లీలో.

**మధుర:** మీరు విశాఖలో సెటిలవక హైదరాబాద్ చేరారేం? కాల్పనిక సాహిత్యానికి పెద్ద భవిష్యత్తు లేదన్నార్ట మీరు?

**వరద:** లేదు, రాసేవాళ్ళు మానేశారు. రాయగూడని వాళ్ళు విజృంభించిపోతున్నారు. ఆవిష్కర్మలు అంకితాలు, సన్మానాల జోరు ఎక్కువైపోతోంది.

**మధుర:** మీ నాన్న గారి పద్యాలు పురాణం పట్టుకపోయి వేశాడ్ట ఆంధ్రజ్యోతిలో.

**వరద:** ఒకటి గ్యాపకం.

చచ్చిపోయి జీవి యెచ్చట కేగునో
ఏమి యగునొ యెవరికెరుగ రాదు
ఎరుకలేని వారలే మేము చెప్పగా
విని తపించు వారు వేన వేలు.

**మధుర:** తెలుగువాడి గురించి మీ వ్యాఖ్య వినాల నుంది

**వరద:** తెలుగువాడు దుర్యోధనుడిలాంటివాడు. దుర్యోధనుడు తనకేమీ కావాలనడు. ధర్మరాజుకి మాత్రం ఏమీ ఉండకూడదంటాడు. తెలుగువాడూ అంతే. I had a loving quarrel with the world.

**మధుర:** మీతో హస్కు కొడుతున్నానని గిరీశం గారు కోపం చేస్తున్నారు. ఛీరియో!

*('మిసిమి' అక్టోబర్, 1996)*

# కొడవటిగంటి కుటుంబరావు తో



(కొడవటిగంటి కుటుంబరావుగారు నేలమీద చాప వేసుకుని పొట్టకింద దిండువేసుకొని, ఒకచేత్తో సిగిరెట్టు కాలుస్తూ, ఒకచేత్తో రాసుకుంటూ వుంటారు - గదిలోకి ప్రవేశం మధురవాణి).

**మధుర:** చక్రపాణిగారూ మీరూ కరటక దమనకుల్లా కలసీమెలసీ వుండేవారట -

**కొ.కు.:** అదేం పోలిక.... పాలూ నీళ్లలా కలిసివుండేవారమని అనక - మేం తెనాలి నుంచీ ఫ్రెండ్స్‌మి.

**మధుర:** తెనాలంటే గుర్తుకొచ్చింది. మీరు రాసిన కథలన్నీ తెనాలి నేపథ్యంలోంచే అని అంటారు. నిజమా?

**కొ.కు.:** నీకు విజయనగరం, విశాఖపట్నం ఎల్లాగో నాకు తెనాలి, మద్రాసు అల్లాగ.

**మధుర:** మిమ్మల్ని తెలుగువారి చందమామ అంటారు. అవునా?

**కొ.కు.:** ఆ టైటిల్ నాకూ చక్రపాణికీ వర్తిస్తుంది. మా వెనక విశ్వం, చందమామ రామారావుకూడా వున్నారు. చందమామ లైబ్రరీ లాటిది ఎవరికీ లేదు.

**మధుర:** విజయా నర్సింగ్‌హోమ్ మీద మీరేదో జోక్ పేల్చారట!

**కొ.కు.:** అదా - (నవ్వి) నేనూ చక్రపాణీ నడుచుకుంటూ పేషంట్సుగా వెళ్ళి నర్సింగ్‌హోమ్‌లో వుండి డిస్చార్జి అయినపుడు స్ట్రెచర్‌మీద బయటకు వచ్చాం- అని పురాణంతో అన్నా. నీదాకా వచ్చిందీ!

**మధుర:** కుటుంబరావుగారు దేవుళ్ళని నమ్మరుగాని దెయ్యాల్ని నమ్ముతారని మీమీద జోక్‌వుంది. ఏవంటారు?

**కొ.కు.:** (నవ్వి) నా చిన్నప్పుడు తెనాలిలో మాచుట్టాలావిడ ఒకర్తి వుండేది. ఆవిడ ఒంటిమీదకు గాలిసోకేది అనేవారు. ఆవిడ ఆస్థితిలో గాలి పీల్చేది. వదలినపుడు ఎంత గాలివదిలేదంటే అది ఎక్కడనుంచి వచ్చిందా అని ఆశ్చర్యపోయేవాడిని. ఒక మనిషి సాధారణంగా అంతగాలిని నిలిపివుంచడం అసాధ్యం.

**మధుర:** అంచేత దయ్యాలు వున్నాయంటారు?

**కొ.కు.:** అదేకాదు. ఆవిడ గాలిసోకినప్పుడు అనేక భాషల్లో మాట్లాడేది. కవిత్వాలు అప్పజెప్పేది. మళ్ళా తెలివి వచ్చాక మామూలు మనిషి. ఏదో ఒకశక్తి లాటిది లేకుండా యిదంతా ఎలా జరుగుతుంది?

**మధుర:** గురజాడ అప్పారావుగారు దయ్యాల్ని నమ్మలేదు, లుబ్ధావుధాన్లని వూరికే అలా భయపెట్టారుకాని. మీరేవిటి యిలాగ?

**కొ.కు.:** అప్పారావుగారు హేతువాది అంటాను.

**మధుర:** మీ కమ్యూనిస్టులు గురజాడ వారినీ వీరేశలింగాన్నీ కామ్రేడితం చేసేశారు కదా!

**కొ.కు.:** గిడుగువారిని మర్చిపోయావు. అభ్యుదయ కవితోద్యమానికి ఆదిపురుషులన తగినవారు ఆ ముగ్గురూ. తరువాత శ్రీశ్రీ మహాప్రస్థానం దానికి మాగ్నాకార్టా అయికూర్చుంది.

**మధుర:** మీ కమ్యూనిస్టులు నెహ్రూని నమ్మి చెడిపోయారంటారు నిజమా?

**కొ.కు.:** నెహ్రూ అతడి సోషలిజం కబుర్లు మేం నమ్మలేదు. నెహ్రూ నిజస్వరూపం తెలంగాణా సాయుధపోరాటం తరువాత బయటపడింది.

**మధుర:** తెలంగాణాలో పోలీసుచర్య తర్వాత హైదరాబాద్ పారిపోయిన భూస్వాములు వారి తైనాతీలు తిరిగి గ్రామాలలో ప్రవేశించి జాగీర్దార్లు, పటేలు, పట్వారీలు అయి ప్రజలమీద జులుం చలాయించారంటే నెహ్రూ కాంగ్రెస్సే కారణం అంటారు.

**కొ.కు.:** నీకీ వివరాలన్నీ ఎలా తెలుసు? ఆనంద గజపతి కాలంనాటి వసంతసేనవి కదా!

**మధుర:** పుచ్చలపల్లి సుందరయ్యగారి లెక్చర్లు విని వచ్చి వెంకటేశం నాతో ముచ్చటించేవాడు. నార్ల చిరంజీవి ప్రజాశక్తి, విశాలాంధ్ర తెచ్చి చదివి వినిపించేవాడు. తుమ్మల వెంకట్రామయ్యగారు అభ్యుదయకాపీలు మా యింట్లో పడేసేవాడు.

**కొ.కు.:** అయితే మావాళ్ళందర్నీ చెడగొట్టేశావన్నమాట (నవ్వు)

**మధుర:** బాగుపడాలంటే ముందు చెడిపోవాలి కదా!

**కొ.కు.:** నీలో సెర్చిలైటు వేసి గాలించినా చెడు అనే పదార్థం లేనేలేదు కదా!

**మధుర:** అవునూ మీరు కన్యాశుల్కం నోట్సు అని రాశారు, అవి ఏమయ్యాయి?

**కొ.కు.:** విశాలాంధ్రవాళ్ళూ వెయ్యలేదు. విరసంవాళ్ళూ వెయ్యలేదు.

**మధుర:** మీ పూర్వీకులు-

**కొ.కు.:** అల్లపుడెప్పుడో మహారాష్ట్ర నుంచి వచ్చి యిక్కడ సెటిలయిన బాపతు అని విన్నా.

**మధుర:** మీ అన్నగారుండేవారట వెంకటసుబ్బయ్య గారని...

**కొ.కు.:** మా అన్నయ్య కొడవటిగంటి వెంకటసుబ్బయ్య కవి, కథకుడు. ఆయన యింట్లోంచి వెళ్ళిపోయాడు. మళ్ళీ తిరిగి రాలేదు. బైరాగుల్లో కలిసిపోయాడంటారు. మమ్మల్ని చూడ్డానికి మారురూపాల్లో వచ్చాడంటారు. వెళ్ళిపోయిన వారిగురించి అదిగో వస్తాడు-యిదిగో వస్తాడని అనుకోవడం ఎదురు చూడటం కుటుంబాల్లో సహజమేగా!

**మధుర:** మీ అన్నగారి కథలు పోగుచేసి ఒక పుస్తకం వేయలేకపోయారా!

**కొ.కు.:** ఏమిటో ఆ ఆలోచనే రాలేదు. వైతాళికుల్లో ముద్దుకృష్ణ ఒకటీ అరా పద్యాలు వేశాడు.

**మధుర:** చదువు నవల మీ జీవిత చరిత్రలాటిది అంటారు. సత్యమేనా-

**కొ.కు.:** అప్పటి కుటుంబాల స్థితి, నా చిన్నతనం, నాటి వాతావరణం అందులో వున్నాయి.

**మధుర:** మీరు చిన్నకథను మేడేజీ చేశార్ట - అవునా?

**కొ.కు.:** కథ రాయడం కష్టమేమీకాదు. ఎవరైనా రాయవచ్చు. కొత్తవాళ్ళు యువకులు బాగా రాస్తారు. యువకుల చేతుల్లోవుంది కథానిక. ఒక రచయిత రాసిన పదికథలలో కన్నా పదిమంది రాసిన పది కథలలో వైవిధ్యం వుంటుంది అన్నాను.

**మధుర:** ఉం కోటి మంచి ముక్క అన్నారు, ఆడవాళ్ళగురించి - అదేవిటమ్మా-

**కొ.కు.:** జీవితానికి కేంద్ర బిందువు స్త్రీ, స్త్రీ చుట్టూ విస్తరించి వుంటుంది జీవితం అన్నా.

**మధుర:** మీకు ఎమోషన్ లేదు, ఉద్రేకం లేకుండా రాస్తారని అంటారు. అదేవిటి?

**కొ.కు.:** నేను సైన్స్ చదువుకున్నాను కాబట్టి నాది మొదటినుంచీ విశ్లేషణాత్మకమైన మార్గం. కవిత్వం నా వంటికిపడదు. కవిత్వ దృక్పథం లేని వచన రచయితని.

**మధుర:** పాత రచయితలకి కొత్త రచయితలకి మధ్య అక్షాంశరేఖలా వున్నారంటారు మీరు. అంటే కుటుంబరావు తర్వాత వచ్చిన కథకులూ ముందువచ్చిన కథకులూ అని విడగొట్టి చూడాలంటారు కొత్త విమర్శకులు.

**కొ.కు.:** ఎవరాకొత్త విమర్శకులు?

**మధుర:** మీమీద వ్యాసం రాస్తూ సుబ్రహ్మణ్యశర్మ అలాగన్నాడు. అతను మీ వారసుడా?

**కుటుంబ:** ఇది మళ్ళీఫ్యూడల్ ఆలోచన. జర్నలిజంలో నాతరవాతవాడు పురాణం. కథక చక్రవర్తులు, మహాకవులు, కవి సామ్రాట్టులూ యిదంతా ఫ్యూడల్ సెటప్‌లోంచి వచ్చి మన్నిపట్టుకు పీడుస్తున్న బిరుదుల సంత.

**మధు:** బిరుదులంటే మీకు గిట్టదా?

**కొ.కు.:** ఇంగ్లీషులోలాగ మేజర్ రయితలూ, కవులూ, మైనర్ రచయితలూ, కవులూ అని వుంటారుగాని యీ అనవసరపు టైటిల్స్‌ని ఎందుకు మోసుకుంటూ తిరగడం? కీర్తికాయం అసలు శరీరం కన్నా బరువు.

**మధుర:** మహాకవి శ్రీ శ్రీ అంటే మహాకవి అన్నందుకు శ్రీశ్రీగారు సంతోషిస్తాడు కదా! అలాగే విశ్వనాథ వారు కవిసమ్రాట్ అన్నందుకూ.

**కొ.కు.:** అవన్నీ వీక్నెస్సులు - శ్రీశ్రీ అంటే చాలదా! విశ్వనాథ అంటే చాలదా?

**మధుర:** మీ కమ్యూనిస్టులుకూడా యుగకవి, యుగకర్త అని బిరుదులు తగిలిస్తారు కదా; మీరేమంటారు?

**కొ.కు.:** అవి కమ్యూనిస్టుల్లో కూడా యింకాపోని ఫ్యూడల్ వాసనలు. ఈ సొసైటీ నుంచేకదా వాళ్ళూ వచ్చింది. కమ్యూనిజం దేశంలో రాకముందు కమ్యూనిస్టులు ఊహించుకున్న సిద్ధాంతాల ప్రకారం మసలుకుంటారు. ఏంచేస్తాం? పేపరు టైగర్సు !

**మధుర:** కమ్యూనిస్టులు దేశభక్తులు కారు; దేశభక్తి అనేది బూర్జువా లక్షణం - అంటారుట

**కొ.కు.:** నీకు యీ మాటలు ఎవరు నేర్పారు?

**మధుర:** గిరీశంగారు కొన్నాళ్ళు ఆరెస్సెస్‌లో తిరిగారు. అప్పుడాయన కొంతకాలం యాంటీ కమ్యూనిస్టు కూడా. అవును మీరు చందమామలో రహస్యంగా కమ్యూనిస్టు భావాల్ని ప్రచారంచేసేవారట నిజమేనా?

**కొ.కు.:** కథల్లో చిన్నపిసరు ప్రజలపక్షం గెలవడం అదీవుంటే, బీదవాళ్ళకు అన్యాయాలు జరిగితే, వాళ్ళు తిరగబడితే అదంతా మార్క్సిజమంటే ఎల్లాగ? నువ్వీ కొత్త తగూ ఓటి తీసుకురాకు. పైగా మాచక్రపాణిగారు యిట్టే కమ్యూనిస్టు వాసన పట్టేసి అల్లాటివేవీ రాకుండా జాగ్రత్తపడతాడు. ఇన్నేళ్ళు చందమామలో 'ప్రేమించాను', 'ప్రేమ' అన్నమాటలు దొర్లకుండా జాగ్రత్తపడ్డాం. పిల్లల పత్రికలో పెద్దవాళ్ళమాట అదెందుకు అని దాన్ని టాబూ చేశాడు చక్రపాణి.

**మధుర:** చందమామ నేనూ చదువుతూ - అందుకే అడిగా ఏమీ అనుకోకండి. మీకు హార్మనీ వచ్చా? సంగీతం అంటే చాలా యిష్టమని విన్నాను.

**కొ.కు.:** నేను చిట్టిబాబు వీణకచ్చేరి ఎక్కడ జరిగినా మా ఆవిడతో వెళ్లి విని ఆనందించివచ్చేవాడిని. చిట్టిబాబు నన్ను ముందు వరసలో వచ్చి కూచోమనే వాడు. శ్రోతలతో కలిసిపోయి, వాళ్ళ వ్యాఖ్యానాలు ప్రశంసలు ఒక చెవినా, మీ కచేరీ మరొక చెవినా వింటూంటే గొప్ప థ్రిల్లింగ్గా వుంటుంది. మన స్నేహాన్ని బయటి పెట్టి అదిపాడు చేయకండి - అని చిట్టిబాబును వారించా.

**మధుర:** నాది బొబ్బిలి వీణ. నేను వాయిస్తూంటే వింటూ తన్మయులైపోయేవారు అప్పారావుగారు. మీకు కర్ణాటకమా, హిందూస్థానీయా ఏది అభిమానం?

**కొ.కు.:** హిందూస్థానీలో కరీంఖాన్, ఫయాజ్‌ఖాన్, బడేగులాం ఆలీఖాన్ లాంటివారిని ఆరాధిస్తే - కర్ణాటకలో సెమ్మంగుడి, అరియకుడి, సుబ్బులక్ష్మి, చెంబై, మదురమణి, బాలమురళి వగైరాలని అభిమానిస్తా.

**మధుర:** మరి సినిమా సంగీతంలో.

**కొ.కు.:** సైగల్ని తప్ప ఎవర్నీ నేనంతగా మెచ్చుకోను.

**మధుర:** లతామంగేష్కర్ గురించి ఏమంటారు?

**కొ.కు.:** లతామంగేష్కర్ కంటే ఆశాభోంస్లే గొప్ప గాయని అంటా. సంగీతంలో లత, గానంలో ఆశా ఒకరినొకరు మించుతారు.

**మధుర:** మీది శ్రావ్యమైన గొంతు అని విన్నా.

**కొ.కు.:** నన్ను నేను పొగుడుకోను. నాకు హార్మనీ యిష్టం. వాయిస్తా - బొంబాయి వెళ్ళి బాలగంధర్వ, దీనానాథ్, మాస్టరు కృష్ణారావుల పాటలు ప్రత్యక్షంగా వినివచ్చా. మా అబ్బాయి రెండో వాడు రోహిణీ ప్రసాద్ సితార్ బాగా వాయిస్తాడు.

**మధుర:** పాత రికార్డులున్నాయా మీ దగ్గర.

**కొ.కు.:** అది నా హాబీ. ఒకసారి చిట్టిబాబును అడిగా - ' ఒకే రాగానికి రెండు వెర్షన్సు వుంటాయా?' అని. వుండవు అన్నాడు. రెండురకాల ట్రీట్‌మెంట్సు వుంటే వుంటాయి అన్నాడు.

**మధుర:** అయితే మీది విమర్శనాత్మక పరిశీలన అన్నమాట. మీకు సినిమాలతో బాగాపరిచయం వుందిగా, ఎప్పుడైనా సినిమాల్లో నటించారా?

**కొ.కు.:** నిడుమోలు జగన్నాథ్ అప్పుడు యువక డైరెక్టర్, ప్రొడ్యూసర్. 'తారుమారు' 'భలేపెళ్ళి' అనే రెండు పొట్టి హాస్యచిత్రాలను తీశాడు. అందులో 'తారుమారు'లో వేశాను. సంభాషణలు నేనే రాశా. సంగీతం రజనీకాంతరావ్.

**మధుర:** కామమ్మ మొగుడ్ని కాకపోతే కర్రబుర్రా ఇవతల పారేయండి. లేచిపోతా - అన్న సామెత థీమ్‌మీద రాశారట ఏమిటి?

**కొ.కు.:** 'లేచిపోయిన మనిషి' పెద్ద కథ. భారతి రజతోత్సవ సంచికలో వచ్చింది. అది రేడియో నాటకంగాకూడా రాశాను; రజని ప్రోద్బలంతో.

**మధుర:** కొత్త పత్రికలన్నిటిలో మీరు రాసింది ఏదో వుండేది లాంఛనంగా - వాళ్ళు అడిగేవారా?

**కొ.కు.:** పోనీ పాపం అని ఏదో ఒకటి రాసి పంపేవాణ్ణి వాళ్ళను నిరుత్సాహ పరచకుండా. నేను దేనికీ పొంగిపోలేదు. కుంగిపోలేదు.

**మధుర:** శంకరాభరణం గూర్చి మీరేమంటారు?

**కొ.కు.:** కథలో గొప్పతనం యేమీలేదు. కానీ తీసిన విధానం అందులో యువకుడు కానివాడిని కథానాయకుడుగా తీసుకోడం, నడివయస్సుదాటిన పాత్ర ప్రేమభావన; ఇవి గొప్పవి. అదలా ఉండగా సినిమారంగంలో స్టార్ వాల్యూ సిస్టమ్‌ను శంకరాభరణం ధిక్కరించింది. చవకబారు సన్నివేశాలతో యువతరాన్ని పెడదారులు పట్టించే నిర్మాతలకు షాక్ యిచ్చింది.

**మధుర:** కమ్యూనిస్టుగా యీ సినిమాని ఒప్పుకుంటారా?

**కొ.కు.:** అదే ఇందులో ఉన్న పెద్దచిక్కు. భూస్వామ్య విలువలను ప్రతిబింబించి వాటికి హారతిపట్టింది. అదీ గొడవ-

**మధుర:** సినిమా నిర్మాతాలు సినిమా కథలను తమ చిత్తం వచ్చినట్లు మారుస్తూ వుంటారుకదా! మీరేమంటారు?

**కొ.కు.:** రచయితలను ఆర్థిక వత్తిడితో అందుకు ఒప్పించడం వ్యభిచారం వంటిది.

**మధుర:** చైనాలో గ్యాంగ్ ఆఫ్ ఫోర్‌ను నిర్బంధించడం ఎటువంటిది?

**కొ.కు.:** హువా కువోఫెంగ్, తెంగ్ శియాజ్ ఫెంగ్ నాయకత్వంక్రింద నిర్బంధించడం సరైనచర్య. అయితే, కృశ్చేవ్‌కూ తెంగ్‌శియాబ్ ఫెంగ్‌కూ ఏవీ తేడాలేదు.

**మధుర:** మీరు విప్లవ రచయితల సంఘం పెట్టడానికి కారణం?

**కొ.కు.:** స్వాతంత్ర్యం మనకు వచ్చి యిన్ని దశాబ్దాలు దాటుతున్నా ప్రజల ఆర్థికస్థితి,

సామాజిక దురాచారాలు పెరుగుతున్నాయే కాని తగ్గడం లేదు. బీదలను ఉద్ధరిస్తామని వారి ఓట్లతో గెలిచి ఆ తర్వాత భూస్వామ్య, ధనికవర్గాలకే అనుకూలంగా పాలించడం మామూలయిపోయింది. మార్క్సిస్టు సిద్ధాంతాలకు వారసులమనే వారు పంచవర్ష ప్రణాళికారచనకు కూర్చున్న మేధావులవలె - ఏయే చిట్కాలు ప్రచారంలో పెడితే, ఏయే పార్టీలతో పొత్తు కలుపుకుంటే; ఎన్నికలలో అధికంగా లాభిస్తుంది - అన్న చర్చలతో తలమునకలవుతున్నారు. ఇట్టి పరిస్థితిలో పీడిత ప్రజలను చైతన్యవంతులను చేసే ఆశయంతో రావిశాస్త్రి, వరవర రావు, కాళీ పట్నం, కె.వి. ఆర్ మొదలైన రచయితలతో కలిసి విరసాన్ని స్థాపించాం.

**మధుర:** ఏమండీ మీరు ఒక ట్రక్కుకు సరిపడ్డ రచనలు చేశారుకదా! పదికాలాలు నిలిచే ఒక గొప్ప పాత్రను సృష్టించలేకపోయారే?

**కొ.కు.:** (నవ్వి) అల్లాటివారు నిజంగా వుండరు నేటి వ్యవస్థలో - ఒకవేళ నా డిటెక్టివ్ కేయాస్ నిలుస్తాడేమో?

**మధుర:** మీ హాబీలేమిటి?

**కొ.కు.:** తోటపని, ఫొటోగ్రఫీ ...

**మధుర:** చందమామను మీరంతా పిల్లలకోసం చేసినా దాన్ని వీరివిగా పెద్దవాళ్ళు చదువుతారని అంటారు - అవునా?

**కొ.కు.:** ''చందమామను నాచేత కూడా చదివిస్తున్నారు. హాయిగా బావుంటుంది. లేటుగా వస్తే కొట్టువాడితో దెబ్బలాడతా. యింకా రాలేదేమని-'' అన్నారు విశ్వనాథ సత్యనారాయణ గారు.

**మధుర:** మీకు యిష్టమైనవి ఏవి?

**కొ.కు.:** ప్రముఖ చరిత్రకారుడు కోశంబి పరిశోధనలు, సుమేరియన్, బాబిలోనియన్, సిరియన్, ఈజిప్షియన్, హరప్పా - మొహంజదారో నాగరికతలగురించి, హిందూ సమాజపరిణామాల గురించి మాట్లాడడం యిష్టం నాకు.

**మధుర:** మీరు ప్రతిదినం డైరీ రాసేవారా? ఏం రాస్తారండీ-

**కొ.కు.:** సామ్యూల్ పెప్పీస్‌లాగ. ఎప్పుడైనా చూస్తారుగా! (శ్రీమతి వరూధిని, చలసాని ప్రసాద్, యీపనికి పూనుకోవాలి). నేను ఇన్‌వాలిడ్ ని, ఎందుకండీ బ్రదకటం అంటే చందమామ రామారావు 'మీరు కలంవీరులు; వుండాలి' - అలా అనేవాడు (నువ్వు).

**మధుర:** మీ వ్యక్తిత్వంలోని ముఖ్య లక్షణం?

**కొ.కు.:** మనస్సుకీ దేహానికి సోమరితనం అనేది లేకపోవడం.

**మధుర:** మీ అలవాట్లలో ముఖ్యమైనది?

**కొ.కు.:** ఉత్తరాలకు వెంటవెంటనే జవాబులివ్వడం.

**ఆరుద్ర:** ఆ గొడవంతా తుమ్మల వెంకట్రామయ్యగారు చూసుకునేవారు.

**మధుర:** అన్నట్టు రావిశాస్త్రి గారితో గొడవేమిటి?

**ఆరుద్ర:** ఆయన ద్వితీయం చేసుగున్నపుడు చమత్కారంగా ఏదో అన్నా. తర్వాత ఆయన కొంచెం అలిగాడు.

**మధుర:** శ్రీశ్రీ షష్టిపూర్తి సభలో మీరూ అలిగారట?

**ఆరుద్ర:** రావిశాస్త్రీ లేడు, శ్రీశ్రీ లేడు, అదంతా పాత చింతకాయపచ్చడి. పురాణమిత్యేవ సాధుసర్వం. చాసో సప్తతి ఉత్సవానికి నేను విశాఖపట్నం వెళ్లాను. మమ్మల్ని బాగా గౌరవించారు.

**మధుర:** నారాయణబాబు రుధిరజ్యోతి ముందు పారేసి తర్వాత దొరికితే పుస్తకం వేశార్ట; ఆ గొడవేంటి?

**ఆరుద్ర:** శ్రీశ్రీకి నారాయణ బాబంటే ఒక విధమైన ఫీలింగు వుండేదనుకుంటా. ఎవరూ తన యిజాల ఎత్తుకు వస్తే సహించేవాడు కాదు. శ్రీశ్రీ కవితలకు వాళ్లవీ వీళ్లవీ ఇన్స్పిరేషన్లు. అసలు సిసలైన మోడ్రన్ పోయిట్రీ నారాయణ బాబే రాశాడు.

**మధుర:** ...అని చాసో వగైరా విజయనగరం వాళ్లు అంటారు. ''చెర్రీ అర్చర్డు''ని 'సంపంగి తోట' అనే పేరుతోనారాయణబాబు చేత రాయించి శ్రీశ్రీ వరదా తమ పేర్లు వేసుగున్నార్ట-

**ఆరుద్ర:** అబ్బూరి రామకృష్ణారావు గారి జవాబుతో ఆ తగూ సమసిపోయింది.

**మధుర:** మీరు నాస్తికులైవుండి శ్రీరాముడి మీద మంచి పాటలు రాశారు. మీరు వాడుకున్నా వాడుకోకపోయినా స్వర్గంలో బెత్తెడు పుణ్యం మీ పేరజమ అయి కూచుంది. శ్రీరామ నవమికి మీ పాట లేకుండా జరగదు.

**ఆరుద్ర:** అంతా మార్క్సు దయ!

**మధుర:** సినిమా పాటలు మీవి జగత్ ప్రసిద్ధాలు. అన్నట్టు మీ సినిమా పాటల్లో సాహిత్యం మారింది. ప్రేమ లేఖలు - రాజకపూర్ సినిమాకు మీరు రాసిన తెలుగు పాటలు ఆ భాషే, శైలీ మరువలేం!

**ఆరుద్ర:** బొంబాయి వెళ్లి రాశా - 'పందిట్లో పెళ్లవుతున్నాదీ', 'పాడు జీవితమూ యవ్వనం మూడునాళ్లా ముచ్చట లోయీ' - ఇలా చాలా పాటలు జనాన్ని పరవశింప జేశాయి.

**మధుర:** మీరు గురజాడ వ్యావహారిక భాషా ఉద్యమాన్ని చాలా దూరం తీసికెళ్లారు. ఆయన ఋణం తీర్చుగున్నారు.

**ఆరుద్ర:** నేనూ శ్రీశ్రీ కలిసినపుడు వరసగా ఎంతసేపయినా కన్యాశుల్కం డైలాగులు వప్పజెప్పుగున్నట్లు పలికే వాళ్లం. అన్ని సందర్భాలకూ చక్కగా అతికేవి.

**మధుర:** మీరు ఇంగ్లండు పర్యటించారట గదా!

**ఆరుద్ర:** జమలాపురం కేశవరావు గారి అబ్బాయి డాక్టరు, బర్మింగ్ హామ్‌లో. నేనూ

పురాణం, సోమసుందర్ అక్కడే కలుసుగుంట. శర్మని నేనే, లండన్‌లో తిప్పి అన్నీ చూపించింది. గూటాల కృష్ణమూర్తిగారింట్లో దిగాం. వ్యావహారిక భాషకు డిక్షనరీ వ్రాసిన గ్విన్ దొరగార్ని అక్కడే కలుసుగున్నాం. స్పెనియార్డ్స్ ఇన్ డికెన్స్ నవలలో చెప్పిన హాంస్టెడ్‌లో తిరిగాం. ఛార్లెస్ అండ్ మేరి లాంబ్ కాలం నాటి పబ్‌లో బీరు తాగాం.

**మధుర:** అసలు మీకూ శ్రీశ్రీకీ ఎక్కడ వచ్చింది పేచీ?

**ఆరుద్ర:** మాకు విభేదాలు లేవు. అన్నీ కల్పితాలే. ఏవో పొరపొచ్చాలు వచ్చినా మా సంబంధాలు బెడిసిపోలేదు. రాజకీయంగా అతనిది ఓ మార్గం, మాది మరోమార్గం.

**మధుర:** తగూలు ఆడవాళ్ల వల్ల వస్తాయని అంటారు.

**ఆరుద్ర:** సినిమా వాళ్లు కూడా తగూలకు కారణం అవుతూంటారు.

**మధుర:** మీరు సమగ్ర ఆంధ్ర సాహిత్యం రాశార్ట. కవిత్వం ఏదో రాసుకోక యీ చరిత్రా రీసెర్చీయేమిటి?

**ఆరుద్ర:** అదో పెద్ద ప్రాజెక్టు. డబ్బు నాలుగు రకాలుగా - నాలుగు మార్గాల గుండా వస్తేనే కదా, సంసారం గడుస్తుంది నిశ్చింతగా.

**మధుర:** మీ శ్రీమతిగారు కూడా పెద్ద రైటరు. యమ్వీయల్ కొన్నాళ్లు మీ దగ్గర వుండేవార్ట.

**ఆరుద్ర:** నిజమే - ఎమ్వీయల్ ఒక అద్భుతమైన చిన్నవాడు. చాలా కుశాగ్ర బుద్ధి. అతనూ పురాణం కలిసి మినీ పొయిట్రీ కొత్తగా ప్రారంభించారు. నేనూ చాలా రాశా.

**మధుర:** మీరు గడ్డం యెందుకు పెంచారు?

**ఆరుద్ర:** సమగ్ర ఆంధ్ర సాహిత్యం పూర్తయేదాకా గడ్డం తీయరాదని అనుకున్నా. అంతకు ముందు మామూలుగా వుండేవాణ్ణి.

**మధుర:** ఈ బైరాగి డ్రెస్సు కూడా ఆ సమగ్ర ఆంధ్ర సాహిత్యం బాపతేనా-

**ఆరుద్ర:** ఇది చవక. గుర్తుపట్టడం తేలిక.

**మధుర:** గడ్డాన్ని మెయిన్‌టైన్ చెయ్యడం అంత తేలిక కాదు. చెళ్ళపిళ్ళ వారికి గడ్డం వుండేది. కాశీ కృష్ణాచార్యుల వారికి గడ్డం వుండేది. 'షా'కు వుండేది.

**ఆరుద్ర:** ఇంత తొందరలో నన్ను పెద్దవాళ్లలో చేర్చకు.

**మధుర:** మీరో డిటెక్టివ్ నవల రాశారనుకుంటా.

**ఆరుద్ర:** 'పలకల వెండి గ్లాసు' లాంటివి పదో పన్నెండో.

**మధుర:** ఇంటింటి పజ్యాలు రాసింది మీరేగా?

**ఆరుద్ర:** రాఘవయ్యగారి జ్యోతిలో

**మధుర:** మీకు మ్యాజిక్కులు తెలుసనుకుంటా

**ఆరుద్ర:** రాఘవయ్య గారమ్మాయికే నేర్పా. ఇప్పుడామె నిజంగా మంచి డాక్టరు.

**మధుర:** మీ కుమార్తెలు ఎవరూ మీ దారిన రాలేదా.

**ఆరుద్ర:** మా రౌద్రి కవిత్వం రాస్తే శ్రీశ్రీ ఇంట్రో రాసి ఆశీర్వదించాడు.

**మధుర:** మీరు సిగరెట్లు కాల్చేవారా?

**ఆరుద్ర:** పూర్వం. గడ్డానికీ సిగరెట్లకూ చుక్కెదురు.

**మధుర:** సోమసుందర్ మీకు తెలుసా?

**ఆరుద్ర:** సాటికవే - తెలుసా ఏమిటి.

**మధుర:** మీ త్వమేవాహం అతనే వేశాడు గావును మొదట.

**ఆరుద్ర:** నేను సినిమా పాటలు రాసి బాగా వున్నానని అతను కూడా మద్రాసు వచ్చి పాటలు రాయాలని ప్రయత్నించి పలకక తిరిగి పిఠాపురానికి రైలెక్కాడు. అప్పుడు నేను ఒక సాంగ్ సెషన్‌లో ఇరుక్కుని వెళ్లి రైలెక్కించలేక వూరుకున్నా.

**మధుర:** అతను ఫీలయి వుంటాడు బాగా.

**ఆరుద్ర:** ఆ సందర్భం అలా వచ్చింది. నేను నిస్సహాయుణ్ని.

**మధుర:** ఒక్క పాట కూడా యివ్వలేదా పాపం!

**ఆరుద్ర:** సినిమా ప్రపంచం అన్నాడు గదా, శ్రీశ్రీ ...

**మధుర:** ఈ ప్రపంచంలో ఎవడిదగ్గర వున్నదాన్ని వాడుయిచ్చి - తనక్కావలసింది తీసుకుంటాడు.

**ఆరుద్ర:** ఆ కావలసింది డబ్బు. లచ్చి తల్లికి జాతి భేదం లేదన్నాడు రావిశాస్త్రి.

**మధుర:** డబ్బు ముఖ్యమే కాని డబ్బు కోసం రాయడం పాపం కాదా?

**ఆరుద్ర:** రాయడం ఒకప్పుడు బతకడం కోసం. బతకడానికి అన్నీ కావాలిగా.

**మధుర:** శ్రీశ్రీగారు మీ వద్ద అప్పు చేసేవారా?

**ఆరుద్ర:** ఆయన నాకు మేనమామ. మావా అల్లుళ్ల మధ్య అనేక వ్యవహారాలుంటాయి. అవన్నీ నీకెందుకు?

**మధుర:** మనవంతా ఒక వూరి వాళ్లం కదా- యోగక్షేమాలు తెలుసుకోవడంలో మీరంత టచ్చీ అవుతారెందుకూ? నాకు తెలిసినంత మేరకు శ్రీశ్రీగారికి డింకాపేక్ష ఎక్కువ. అన్నట్లు ఆరుద్ర అంత్యక్రియలికి ప్రసిద్ధి అని అంటారు లోకం.

**ఆరుద్ర:** అంత్యక్రియలు కావు ఖర్మ - ''అంత్యప్రాసలారుద్రవి'' అని పేరు.

**మధుర:** మిమ్మల్ని బలమైన కంఠంగల యీ శతాబ్దపు కొరకరాని కొయ్య అన్నారు త్వమేవాహం ముందు మాటలో - పాపం, చిత్రకవులకీ పదబంధ కవులకీ మీకూ మౌలికంగా తేడా యేమిటీ అని ఆలోచిస్తున్నా.

**ఆరుద్ర:** నేను మోడ్రన్ని. వాళ్లు పాతవాళ్లు. సమాజ క్షేమం నా లక్ష్యం.

**మధుర:** తెలుస్తోంది. మీరు సామాజిక స్పృహ గాళ్లని. అసలైన కవిత్వం ప్రజలమీద వానలాగ కురవాలి. విశ్వనాథవారు 'వానలో తడియని వారు, మద్గురు మృదూక్తి మరంద ధారలో తనియనివారు లేరనుట సిద్ధము నైజము తెన్గునాడునన్' అన్నారు. పాఠకుని హింసపెట్టడం కవిత్వమా?

**ఆరుద్ర:** అది కవిత్వానికి హ్రస్వ లిపి. అది అర్థమైతే 'త్వమేవాహం' అర్థం అవుతుంది.

**మధుర:** మీలోని యాంగ్జయిటి, కన్ఫ్యూర్షన్ అంతా 'త్వమేవాహం'లో వుందనుకుంటా-

**ఆరుద్ర:** 1948లో రజాకార్లచే చెరబడ్డ స్త్రీ కథనం కృష్ణాపత్రికలో చదివి 'త్వమేవాహం' మొదలెట్టా. అదే తెలంగాణాలో సాయుధ పోరాటంగా మారింది.

**మధుర:** ఇక నేను పద్యాలు రాయనవసరం లేదన్నాడట - శ్రీశ్రీ

**ఆరుద్ర:** అప్పటి అభిమానం అలా అనిపించి వుంటుంది!

**మధుర:** సినిమా ధనస్వామ్యం మిమ్మల్ని తెలివిగా తనవైపు లాగేసుకుని వుంటుంది.

**ఆరుద్ర:** నన్ను లాగేసుకుంది రామలక్ష్మిగాని ధనలక్ష్మి కాదు.

**మధుర:** శ్రీశ్రీ నుంచి ఎడంగా ఆమె లాగేసి వుంటుంది.

**ఆరుద్ర:** ఆయన నక్సలైట్ల దాకా వెళ్లాడు; నేను ప్రజాస్వామ్యం వద్ద ఆగాను.

**మధుర:** మన దేశంలో ప్రజాస్వామ్యం ధనిక స్వామ్యానికి ముసుగు.

**ఆరుద్ర:** జీర్ణమంగే సుభాషితం అని వొకప్పుడు 'త్వమేవాహం' రాశాక నిరాశ చెందాను. నా కవిత్వం రుద్రాక్ష పాకంలో వుంటున్నదన్నారు. నాకు ఆనందాన్నిచ్చే తానం వాయించుకోక పురజనుల కోరికమీద అల్లాటప్పా పాటలు వ్రాయించే స్థితికి వచ్చా. సజ్జల కవిత్వం రాశా.

**మధుర:** ప్రజా కవిత్వం వేరూ అభ్యుదయ కవిత్వం వేరూ అంటే మీ మిత్రులకి మీమీద కోపం వచ్చిందని విన్నా.

**ఆరుద్ర:** బండివాడి పాట అర్థమైనట్టు మహాప్రస్థానం లోది అర్థం కాదు కదా - 'అప్పనాతనామనా' అర్థమైనట్లు 'రామ నీ సమాన మెవరు' త్యాగరాజ కీర్తన ఎలా అర్థం అవుతుంది?

**మధుర:** ఆ మూఢనమ్మకాలని మీరు మార్చలేరు. ఒక కవిని మరొక సహృదయుడైన కవి అర్థం చేసుకున్నట్లు సామాన్యులు ఎలా అర్థం చేసుకుంటారు? వాలు కుర్చీ కవులు కళ కళకోసమే, కోన్కిస్కాగాళ్ల కోసం కాదని అంటారు.

**ఆరుద్ర:** 'త్వమేవాహం'లో కావ్యాన్ని ప్రవాహంగా వూహించి పర్వతదశ, ఉపనదులు, ప్రవాహదశ, రాసేక నదీ ముఖద్వారాన్నీ సాగరసంగ మాన్నీ రాద్దామని మానేశా. కాలానికి సంకేతం గడియారం. గడియారం మన సంఘం. గంటలు శ్రీమంతులు. నిముషాలు

మధ్యతరగతి వాళ్లు. సెకండ్లు 'అలగా' జనం. చిన్న ముల్లు శ్రీమంతుల మనస్తత్వానికి సూచి. పెద్దముల్లు మిడిల్ క్లాసు వాళ్ల భావానికి బరామీటరు. సెకండ్ల ముల్లు శ్రామిక జనుల ఫిలాసఫీకి కొలబద్ద. ఇసక గడియారం, నీటి గడియారం పాతకాలపు సంఘాలు. స్టాప్ వాచీ విప్లవాన్ని టైం చేసే సాధనం. పెండ్యులం చెప్పనక్కర్లేదు-

**మధుర:** ఈవిధమైన సంకేతాలు మీరు మాకు చెప్పకుండా ఎలా తెలుస్తాయి?

**ఆరుద్ర:** 1948వ సంవత్సరం, జులై నెల పదవ తారీకు కృష్ణాపత్రికలో ''నాకా సిగ్గు? నా స్త్రీత్వం ఎప్పుడో పోయింది!'' అనే పతాకతో రజాకార్ల చేత చెరచబడ్డ స్త్రీ కథనం పడ్డాది. ''సుమారు పన్నెండు రోజుల క్రిందటి విషయం. రైలు గుడివాడ దాటుతోంది. ఇందుపల్లె సమీపంలోకి వచ్చింది. రైలు పెట్టెలో వున్న ప్రయాణీకులు హైదరాబాదు విషయాలు చెప్పుగుంటున్నారు. రజ్వీ దురంతాలూ కాందిశీకుల కష్టాలూ వర్ణించి విషాదభరితులవుతున్నారు. ఇంతలో ఆ పెట్టెలో వున్న ఒకావిడ లేచి నిలబడింది. వలువలు తీసివేసింది. ఏమిటీ ఘోరం అని అంతా తలలు వంచుకున్నారు. ఆమె అలాగే నిలబడింది. ఆ పెట్టెలో వున్న ఒక వృద్ధుడు ధైర్యం చేసి - ''అదేమిటమ్మా - ఆడపిల్లవు అలా నగ్నంగా వున్నావు తప్పుకాదూ-'' అన్నాడు. ఆ మాటలో ఆమె తోకతొక్కిన తాచురీతిగా లేచిందట - ''తప్పా - నాకు తప్పా - ఏనోటితో చెప్తున్నారామాట - నేను ఆడదాన్నా - నైజాం కిరాతకులు నన్ను వారం రోజులిలా నగ్నంగా చెట్టుకు కట్టేసి అట్టే పెట్టారు. నా స్త్రీత్వాన్ని ఆనాడే దొంగిలించారు. నా ఆడతనం ఆనాడే పోయింది. ఇంకా ఆడదానివంటారేమిటి - చూడండి నా వంటినిండా గాయాలు. స్త్రీత్వం ఒకసారి పోయిన తరువాత మళ్లీ వస్తుందా - ఇలా వున్నది మా స్థితి! మీరిలా కూర్చుని కబుర్లు వింటున్నారు. నేనేం సిగ్గుపడవలసినది లేదిక. మీరూ, పడవలసినది!.... అని ఒక్కొక్క ప్రయాణీకుడి దగ్గరికి వచ్చి తన వొంటికి వున్న గాయాలు చూపించింది. పెట్టెలో వున్న వాళ్లంతా సిగ్గుతో తలలు వంచుగున్నారు. ఆమె విషాద గాథ విని కన్నీరు కార్చారు. తరువాత ఆమె వలువలు ధరించి వెళ్లి ఒకచోట కూర్చుంది. ఆమె అలా అప్పుడప్పుడు అన్ని తరగతుల రైలు పెట్టెలలోకి వెళ్లి ప్రచారం చేస్తున్నదని తెలిసింది.

**మధుర:** ఇటువంటి నిజాం ప్రభుత్వాన్ని, వ్యవస్థను నెహ్రూగారు తమ పోలీసు యాక్షన్‌తో కైవసం చేసుగుని నిలబెట్టి కాంగ్రెసులో కలిపేశారు ఈ దుర్మార్గపు వ్యవస్థను. చీ!చీ!

**ఆరుద్ర:** తెలంగాణాకు పోలీసు చర్యను పూర్వం స్పేనిష్ సివిల్ వార్‌తో పోల్చవచ్చు. 'స్పయినల్ కార్డులో స్పెయిన్' అనే మాటకు అంతరార్థం పైన చెప్పిన కథ. తెలంగాణా విప్లవమే నా కావ్యానికి ప్రధాన యితివృత్తం కాదు. కాలం ప్రధాన వస్తువు-

**మధుర:** అభ్యుదయ కవిత్వం యేమీ వద్దు. మీరు శుభ్రంగా ప్రజాకవిత్వం రాయండి. 'పాషాణ పాక ప్రభూ!' అని మిమ్మల్ని అనాలి నిజానికి!

**ఆరుద్ర:** అక్రమం జరగడం కవితకు నాంది అనేది ముఖ్యం.

**మధుర:** విడోస్ లేకుండా విడో మేరేజెస్ లేనట్లు 'ముందు విడో కానిమ్ము, తరవాత పెండ్లి యాడెదను' అన్నాడు గిరీశంగారు.

**ఆరుద్ర:** నాకు అతగాడితో చుట్టరికం కలపకు, నీకు పుణ్యం వుంటుంది. కవిత్వం జీవితాలకి వెలుగు చూపించాలి.

**మధుర:** మీ కవిత్వం వెన్నెట్లో టార్చిలైటు కారాదు. చక్రాల్లో చెక్రాలున్నట్లు అర్థాల్లో అంతర్థాలుంటాయి అంటారు శ్రీశ్రీ.

**ఆరుద్ర:** కల నిజపరచడం కాదు కవిత్వం. నిజాన్ని కలగనడమే దాని తత్వం. మెదడూ హృదయం మిళితమయే గుణం - అదే మహాకావ్యానికి ఏకైక లక్షణం అన్నాడు మా మావయ్య.

**మధుర:** నార్లగారి లైబ్రరీ గొప్పదా, మీదా?

**ఆరుద్ర:** ఎవరి లైబ్రరీ వారికే ముద్దు!

**మధుర:** కేవలం కవిత్వ పిచ్చిలోనే పడకండా మీరు స్కాలర్ మరియూ రీసెర్చి స్కాలర్ ముసుగును కూడా ధరించారు కదా!

**ఆరుద్ర:** స్కాలరేవిటి, ముసుగేవిటి?

**మధుర:** హోమియోపతీ వైద్యుణ్ణి డాక్టరంటే సంతోషిస్తాడు. మిమ్మల్ని పండితుడు అనకుండా స్కాలరన్నాను. శ్రీశ్రీ కూడా స్కాలరే అయినా మీలా పండితుడు కాదు.

**ఆరుద్ర:** నేను పత్రికా రచయితను. ఒకప్పుడు నేనూ శ్రీశ్రీ ఆనందవాణి ఎడిట్ చేశాం. ఆ రోజుల్లోనే పురాణాన్ని నేను 'గోడమీద సాలీడు' రచనతో డిస్కవర్ చేశా.

**మధుర:** అయన మీ శిష్యుడా?

**ఆరుద్ర:** చెప్పలేను కాని నేను మాత్రం ఆయన గురువుని. మేమిద్దరం లండన్‌లో, బర్మింగ్‌హామ్‌లో కలిసే తిరిగాం. నేనాతని గైడ్‌ని.

**మధుర:** తెలుగువాళ్లతో సుబ్రమణియ భారతి గారి స్నేహాన్నీ ప్రేమనీ మీరు వ్యాసాలలో బాగా బైటపెట్టారు.

**ఆరుద్ర:** భారతదేశం మొత్తాన్ని సమైక్యంగా చూసిన తమిళ మహాకవి భారతి. 'జాతీయ సమైక్యత' అని గవర్నమెంటు స్లోగన్ పుట్టించకపూర్వం ఊహించి కలగన్నాడతను.

**మధుర:** ఇప్పుడు ఆ తమిళులే ఎల్.టి.టి. ఇ.వాళ్లతో చేరి జాతీయ సమైక్యతకు మంగళం పాడేస్తున్నారు. రాజీవ్ గాంధీని పొట్టన పెట్టుకున్నారు. విశాల దృక్పథం లేని వాళ్లు జాతిని ముందుకు నడిపించలేరు. ఇప్పుడు తమిళనాడు పీతలా అడ్డంగా నడుస్తోంది.

**ఆరుద్ర:** రాజభాష ఉన్నత వర్గాల వారివల్ల మాతృభాష శ్రామికుల వల్ల పెంపొందుతాయి, నిజంగా. గురజాడ వారు మదరాసు తెలుగు భాషకు సవతి తల్లి అన్నారు. అది ముమ్మాటికీ నిజం.

**మధుర:** నేటి తమిళులకు విశాల దృక్పథం లేదు అనేది నిజం. అవసరమైతే వారు వేరింటి కాపరానికి సిద్ధం. ప్రత్యేకత వేరు; వేరుగా వుండ కోరడం వేరూ-

**ఆరుద్ర:** వారి రాజకీయాలు మనకు వద్దు. తెలుగు స్కూళ్లు లేకుండా చేసిన ఘనత

వారిది. మదరాసులో తెలుగు వారిని ఎంత చిన్నచూపు చూసినా ''కుంచం తిరగేసి కొలిస్తే చేరడు మాకలేనా మిగులుతా''యని వూరుకునే మనస్తత్వం పోవాలి.

**మధుర:** చెన్నప్ప అనేవాడు తెలుగువాడు. చెన్నపట్టణం యిప్పుడు 'చెన్నై'గా మారింది. అయితే హిందీ దుర్మార్గాన్ని వ్యతిరేకించడంలో తమిళులు చాలా గొప్పవారు. అన్నట్లు పెద్ద బాలశిక్ష ఎవరు రాశారో చెప్పండి.

**ఆరుద్ర:** పుదూరు సీతారామశాస్త్రి గారు. ద్రావిడ బ్రాహ్మణులు. ద్రావిడ బ్రాహ్మణుల్లో పుదూరు ద్రావిళ్లు, కరువది ద్రావిళ్లు, దిమిలి ద్రావిళ్లు వున్నారు. అంతేగాని పుదూరు ఇంటి పేరు కాదు. అసలింటిపేరు చదలవాడ. బ్రౌన్ దొరగారి వద్ద ముఖ్య పండితులు. కొన్ని కోట్ల ప్రతులు ముద్రితమైన పుస్తకం ఇది.

**మధుర:** మీరు ఆంధ్ర ఆస్థాన కవిగా వుండతగినవారని నా అభిప్రాయం.

**ఆరుద్ర:** థాంక్స్! నేను వుండేది మదరాసులో. అన్నట్లు అక్కడ మన నారాయణ రెడ్డి వున్నాడు గదా!

**మధుర:** ఆంధ్రుల మనసులలో కొలువుండదగిన వ్యక్తిత్వం మీది. పైకి 'షా'లా గడ్డం అదీ మీరు సూటవుతారు. మహాకవి కొలతలకు కూడా.

**ఆరుద్ర:** ఉత్తర భారతంలో మనకు ఉప్పూ పత్రీ లేని రోజుల్లో దక్షిణాదిని మాత్రం సంగీత నాట్యరంగాలను తెలుగే యేలుతూ వుండేది. శతాబ్దాల తరబడి నాయక రాజుల పాలనలో తెలుగు సామ్రాజ్యాధికారం సాంస్కృతిక రంగాలలో కూడా విస్తరించింది. వాగ్గేయకారులు ఏ భాష వారైనా తెలుగులో రచనలు చేసేవారు. సామ్రాజ్యం పోయినా సంప్రదాయం అలానే వుండిపోయింది.

**మధుర:** కదన కుతూహల రాగంలో పాడే 'రఘువంశ సుధాంబుధి చంద్రమా', ఎవరు చేశారు?

**ఆరుద్ర:** పట్నం సుబ్రహ్మణ్య అయ్యర్ గారు చేశారు. కచేరి బాణీ సంగీతానికి ఆయన మూలపురుషుడు. ఇందులో రాగం - తానం - పల్లవి ముఖ్యాలు.

**మధుర:** దక్షిణాది సంగీతాన్ని కర్ణాటక సంగీతమని ఎందుకంటారు?

**ఆరుద్ర:** చెవులకింపైన సంగీతం అని అర్థం. మనోధర్మ సంగీత ప్రదర్శనకు యిదే అనువైనది. ఎవరు ఆదరిస్తే ఆ రాజుల పేరుతో చలామణీ అవుతుంది.

**మధుర:** మీ 'క్లార్కు సూర్యారావు' వల్ల ప్రేరణపొంది ఆత్రేయ యన్.జీ.వో. రాశాడంటారు నిజమా?

**ఆరుద్ర:** ఇలా అనుకోడం చిన్న పిల్లల మనస్తత్వానికి దగ్గర. మధ్యతరగతి మనిషి మిధ్యా జీవితాన్ని ఎవరు ఏవిధంగా చిత్రించినా ఆదరణీయమే -

**మధుర:** మీకు పజిల్సు అంటే యిష్టవా?

**ఆరుద్ర:** 'గళ్ల నుడికట్లు' నాకిష్టమైన క్రీడ.

**మధుర:** సినీవాలి అనే మాటమీద జారిపోయి మీరో కావ్యం రాసి పారేశారు. అలా కావ్యం రాయడం ఒక సర్కస్ ఫీటు కాదా?

**ఆరుద్ర:** ఏది ఏమైనా కావ్యం బాగుందా లేదా అనేది చూడాలి. చంద్రకళ కనబడే అమావాస్యను సినీవాలి అంటారు. పార్వతిని కూడా సినీవాలి అంటారు. ఆశా చంద్రకళ గల యిది సినీవాలి అనడం ఒప్పు అన్నా చివరలో.

**మధుర:** తప్పొప్పుల పట్టిక - స్వవిషయ సూచిక అన్న పేర్లు. చాలా బావున్నాయి. కొత్తదనం ఆరుద్ర అనవచ్చు ననుకుంటా. మీ కవిత్వాన్ని చూసి కృష్ణశాస్త్రి గారేమను కుంటారు?

**ఆరుద్ర:** ఆకలి కేకల కవిత్వంలో సుతిమెత్తని మాటల పొందిక ఎలా కుదురుతుంది చెప్పు

**మధుర:** జాషువా, కరుణశ్రీలు భావకవిత్వ యుగానికీ అభ్యుదయ కవిత్వ యుగానికీ మధ్య సరిపడతారనుకుంటా-

**ఆరుద్ర:** అదంతా చరిత్రకారులు, పరిశోధకులు తేల్చవలసినది. మరి విశ్వనాథవారు మాకు సమకాలికులు. వారు నిజానికి పూర్వయుగానికి చెందినవారిలా కనిపిస్తారు.

**మధుర:** తిలక్ గురించి ఏమంటారు?

**ఆరుద్ర:** ఆయన రసగంగాధర తిలక్ అంటా.

**మధుర:** గురజాడవారు వేసవి దారిని ముందుకెళ్ళిపోతూ విశ్వనాథ వారిని వదిలేశారు వెనక.



*(ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక: 9-08-96)*



# ఉషశ్రీ తో

**మధుర:** శ్రీరామరామరామేతి రమేరామే మనోరమే, సహస్ర నామతత్తుల్యం రామనామ వరాననే.

**ఉషశ్రీ:** ఏవిటి? మధురవాణి శ్లోకాలు వల్లిస్తూందే? ఆశ్చర్యం!

**మధుర:** కాలుజారిన సత్పురుషుని వశాన జన్మించినదాన్ని అన్నారుగా. పైగా సెకండు హ్యాండు బుక్‌స్టాల్లో ఉషశ్రీగారి రామాయణ మహాభారత ప్రవచనాలు కొని చదివా రామప్పంతులు కమానుకి చెక్కేసినపుడు.

**ఉషశ్రీ:** ధన్యోస్మి! వ్యాసం వశిష్ఠనప్తారమ్, వందే వాల్మీకి కోకిలమ్.

**మధుర:** రామాయణంలో నాకు కిష్కింధ, సుందరకాండ లంటే చాలా ఇష్టం. కిష్కింధలో పంప ఋతువులు, తార, వాలి, సజీవంగా కనపడ్డారు.

**ఉషశ్రీ:** పలికించెడు వాడే రామభద్రుడు, సందేహం లేదు. 'కవిర్వాల్మీకి శుద్ధయోః' అన్న శబ్దం అక్కడే సార్థకం.

**మధుర:** మీ పుస్తకంలో ఆ ఘట్టాలు మూలం కలిగించిన అనుభూతికి తక్కువ గాకుండా మనస్సును అలరించాయి. వాల్మీకి వీర విహారం చూసి కాళిదాసు వణికి పోయాడు ఆయన దగ్గర. మీ రామాయణ రచన అస్మదాదులకు గర్వకారణం. ఈ తరానికి ఒక విజయం అంటా.

**ఉషశ్రీ:** పురాణాలు చదవకుండా, వాటిలో ఏముందో తెలుసుగోకుండా ఏక పక్షంగా హేతువాదులం, నాస్తికులం అంటూ తూలనాడటం సబబు కాదు.

**మధుర:** గిరీశం గారిలాగ.

**ఉషశ్రీ:** నిరసిస్తున్నది కుహనా హేతువాదులే.

**మధుర:** మీ భారత రచనలో నిజంగా రెండు కురుక్షేత్రాలున్నాయి. ఒకటి మహా భారతకురుక్షేత్రం. రెండోది హేతు వాదులతో మీరు పెట్టుకున్నది. మీ వచనం పరిగెత్తించే చేవగలది.

**ఉషశ్రీ:** రామాయణ మహాభారతాలు అటువంటి చేవ పుష్టిగల రచనలు. నా ఉపన్యాసాలలో వాటికి పునఃప్రాణ ప్రతిష్ట చేశాను అంతే.

**మధుర:** వెయ్యిమందిలో ఒకడు కవి గాగలిగితే లక్షమందిలో ఒకడు వక్త అవుతాడు మీవలె. మిమ్మల్ని మిమిక్రీ చేసేదాకా మీ కళ జనంలోకి పాకింది. తెలుగులో మొదటి నవల పింగళి సూరన గారి కళాపూర్ణోదయం అంటారు మా గిరీశం గారు. వెంకటేశం అవునంటాడు.

**ఉషశ్రీ:** అది స్వభావోక్తి, ప్రప్రథమ పరమస్వతంత్రాంధ్ర నవల అన్నది అక్షరాలా నిజం. కట్టమంచి రామలింగా రెడ్డి, జి.వి.కృష్ణారావు వంటి ప్రముఖులు ప్రస్తుతించినది.

**మధుర:** మాయా రంభా నల కూబరుల వృత్తాంతాన్ని బట్టి ఇది షేక్స్‌పియర్ 'కామెడీ ఆఫ్ ఎర్రర్సు' ను స్ఫురింప చేస్తుందని గిరీశం గారు అన్నారు నాతో. 1976 దాకా విశ్వనాథ వారి మీద విరుచుకు పడ్డ మారీచ, సుబాహు, ఖరదూషణాదులకు విశ్రాంతి లేని పని కల్పించారు మీరు.

**ఉషశ్రీ:** అసలు మన రామాయణ మహాభారత పురాణాదులకు హేతువాదులు, నాస్తికులే కదా ప్రచారం కల్పించింది. ఇంగ్లీషు చదువుకున్న కొందరు కుహనా మేధావుల వల్ల ఈ జాతి ధర్మ ప్రచార దీక్షకు మనం నోరు చేసుకోవాల్సి వచ్చింది అంతే.

**మధుర:** మీరు చాలా పొగరుబోతు, ఎవరికీ తలవంచరని అంతా అనుకుంటూ ఉంటారు. ఎందుకు ఆ తలబిరుసు?

**ఉషశ్రీ:** (నవ్వుతూ) అది విశ్వనాథ వారి నుంచి సంక్రమించింది. నాకు అక్షరదీక్షనిచ్చిన వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు, నండూరి రామకృష్ణమాచార్య, దిగుమర్తి సీతారామస్వామి, ధర్బా సర్వేశ్వర శాస్త్రి, వీరంతా సౌమ్య స్వభావులే.

**మధుర:** ఇంతకూ ఎవరి తాలూకు మనం?

**ఉషశ్రీ:** అంగీరసబార్హస్పత్యభారద్వాజ...

**మధుర:** మీ ప్రవర కాదు నేనడిగింది. తెలుగులో చెప్పండి.

**ఉషశ్రీ:** గోదావరికి ఆవల కాకరపర్రు అగ్రహారం. పురాణపండ వారి కుర్రవాడ్ని. వెంపరాల వారి శిష్య వంశం.

**మధుర:** మీకు ముందు భద్రాచలం శ్రీ సీతారామ కల్యాణం చెప్పేవారు దాశరధీ శతకంలోనివీ, మొల్ల రామాయణంలోనివీ పద్యాలు చదువుకు పోయేవారు రన్నింగు కామెంట్రీలా. వినలేక చచ్చేవాళ్లం.

**ఉషశ్రీ:** నేను రేడియోలో ఉన్నంత కాలం, నామాట వినే వివేకం కల అధికారులు బ్రతికి ఉన్నంతకాలం జమ్మలమడక మాధవ రామశర్మగారి పక్కన నిలబడి రాముడి పెళ్లి జరిపించాం. మూడు సంవత్సరాలు ఆయన పక్కన నిలబడి తంతులాగించా.

**మధుర:** మీ రేడియో వాళ్లు అప్పుడప్పుడు పురాణం చెప్పుకొనే వారినీ, నాటకం పద్యాలు రాగాలతో పాడేవారినీ పంపి; ఒక పక్క, సీతా కల్యాణం జరుగుతూంటే ఉత్తర రామ చరిత్ర, శూర్పణఖ వర్ణనలు చేయిస్తూంటే నవ్వలేక చచ్చాం.

**ఉషశ్రీ:** మనచుట్టూ ప్రదక్షిణలు చేస్తూ చేతులు నలుపుతూ తిరిగేవారు కాదు రేడియోకి కావలసినది.

**మధుర:** అయితే మిమ్మల్ని మొదట వ్యవసాయ కార్యక్రమాలు చెప్పమనే వారుట. మీరంత ఘటికులా?

**ఉషశ్రీ:** మొదట్లో గుమ్మలూరు సత్యనారాయణ గారు వ్యవసాయ కార్యక్రమాలు

చూసుకునేవారు. నాకు వ్యవసాయ జ్ఞానం శూన్యం. చేతిలో కాగితం లేకుండా నోటికొచ్చినట్లు మాట్లాడగల శక్తి కలవారు రేడియోలో రాణిస్తారు నాలా. ఎదురుగుండా కాగితం పుచ్చుకు చదువుతున్న అనుమానం రాకుండా చెప్పగలవాడు మాత్రమే రేడియోకి కావాలి.

**మధుర:** మొదట్లో మీకు రేడియోలో ఉద్యోగం ఎలా వచ్చింది?

**ఉషశ్రీ:** చక్కని కంఠం, స్పష్టమైన గొంతూ ఉన్న నళినీ మోహన్ సెలవు పెడితే రోజువారీ కూలి మీద నన్ను పిలిచారు.

**మధుర:** మీకసలు తెలుగు నేపథ్యం ఎలా వచ్చింది?

**ఉషశ్రీ:** చిన్ననాడే మా అమ్మగారు నాకు సుమతీ శతకం, వేమన శతకం, భాగవతంలో కొన్ని పద్యాలూ నేర్పించారు.

**మధుర:** తర్వాత-

**ఉషశ్రీ:** హైస్కూలులో వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారి దగ్గర బాల వ్యాకరణంతో నీతి చంద్రిక కంఠోపాఠం చెయ్యడం వల్లా - నాకు వ్యావహారికం అంటే కొంత చులకన ఉండేది.

**మధుర:** అది ఎల్లా వదిలింది?

**ఉషశ్రీ:** ఇంద్రగంటివారి దయవలన, ఈ శతాబ్దంలో మేరుగిరులయిన విశ్వనాథ, శ్రీశ్రీ. వేదుల' రామిరెడ్డి ఇత్యాది మంచి 'పలుకున్న' కవితల రుచి మరిగాక కాలేజీ వదిలే సమయానికి ఆ వాసన కొంత కొంత వదిలింది. ఆ భాష మీద మోహం ఇంకా వదల్లేదు.

**మధుర:** మీరు రూపకాలు కూడా చేశారా?

**ఉషశ్రీ:** ఆహా! నాకు తగిన ధోరణిలో. గొల్లపూడి మారుతీరావు, వి.సత్యనారాయణ, రతన్ ప్రసాద్ సహకరించేవారు.

**మధుర:** హనుమంతుడు మిమ్మల్ని ఆవహించి ఉంటాడు చూస్తే-

**ఉషశ్రీ:** మాట్లాడటం అనే విద్య నేర్చుకోవాలనుకునే వారికి హనుమంతుడే గురువుకావాలి. ఎప్పుడు ఎవరితో ఎంత మాట్లాడాలో హనుమంతునికి తెలిసినట్లు ఎవరికీ తెలీదు. అతను గొప్ప డిప్లమాట్.

**మధుర:** సింహాసనం మీద ఉన్నవారు రాముణ్నీ, సేవా ధర్మ నిర్వహణలో వున్నవారు హనుమంతుడినీ ఫాలో కావాలంటారు.

**ఉషశ్రీ:** (నవ్వుతూ) రాముల వారి సైన్యంలో చేరిన ప్రతి పిల్లకోతీ తనూ ఓ ఆంజనేయుణ్నే అనుకునే వాడట.

**మధుర:** ఈ రోజు కావలసింది పూర్వ సాహిత్యాన్ని ఏ దృష్టితో చూడాలి? ఎలా చదవాలి? ఎలా అర్థం చేసుకోవాలి అని.

**ఉషశ్రీ:** ఆ రహస్యవే నేను ప్రజలకు చెప్పింది. (నవ్వు).

**మధుర:** అందుకే భారత భాగవత రామాయణాలకు మారుపేరు ఉషశ్రీ అనిపించుకున్నారు. వ్యాస వాల్మీకులు మిమ్మల్ని పూనినట్లు మీ గొంతుకలో వినిపిస్తుంది. మీది ఉద్యోగం కాదు సద్యోగం. తెలుగు వారి ఇళ్లను మీ రచనలతో నైమిశారణ్యంగా మార్చేశారు.

**ఉషశ్రీ:** మన పురాణాలు మన జీవ నదుల్లాటివి. పోతన్న, రామరాజ భూషణుడు, శ్రీశ్రీ ఒకకోవలోనివారు ప్రాస ప్రీతిలో. కృష్ణదేవరాయలు, తెనాలి రాముడు, విశ్వనాథ ఒక శ్రేణివారు పదగుంఫనలో.

**మధుర:** ఈ దేశానిది మమ్మీడాడీ కల్చరు కాదనడానికి మీరు చేసిన సేవ చాలా ఉంది. మమ్మీ నిన్ను దలంచి పుస్తకము చేతన్ బూనితిన్ అని చదివే వాళ్లు కాదు కావలసింది.

**ఉషశ్రీ:** నేను కాకినాడలో 47-50ల మధ్య ఇంటర్ మీడియట్ వెలిగిస్తూ ఉండేవాడ్ని. ఆర్ష ధర్మావలంబనయే భారత దేశానికి శ్రీరామ రక్ష అని నమ్మినవాడిని.

**మధుర:** మీరు యక్షగానాల వంటివి రాశారా?

**ఉషశ్రీ:** శ్రీవెంకటేశ్వర కల్యాణం, రాగహృదయం, జ్వలిత జ్వాల, మల్లెపందిరి, ప్రేయసి-ప్రియంవద, నావన్నీ సంప్రదాయ సంపదకు గీటురాళ్లు.

**మధుర:** ఈ సాంకేతిక ప్రజ్ఞను ఆధునిక జీవన విధానాన్ని మీరు తిస్కరిస్తారా? మోడ్రన్సు అంతా ఫూల్సనీ, సైంటిఫిక్ థింకింగ్ గట్రా మనకు అక్కర్లేదనీ అనుకుంటున్నారా?

**ఉషశ్రీ:** నేను నిత్యాగ్నిహోత్రుడ్ని.

**మధుర:** మీరు విశేషంగా పుచ్చుకుంటారని విన్నా - నిజమా?

**ఉషశ్రీ:** ఏవిటి?

**మధుర:** అమృతం.

**ఉషశ్రీ:** నేను సురుడ్ని. అసురుడ్ని కాను. విప్లవం ప్లస్ సంప్రదాయం ఈజ్ ఈక్వల్టూ ఉషశ్రీ. 1970ల్లోనే నన్నువక్తగా రమ్మని పిల్చిన వాళ్లకి మూడు కండిషన్లు పెట్టేను. నూరు; కారు; బీరు. అంటే తెలిసిందికదా!

**మధుర:** తెలిసింది. అయినా వింటే ఉషశ్రీనే వినాలి. తింటే గారెలు తినాలి. మీకోసమే నండూరి రామకృష్ణమా చార్య గారు బియేలో తెలుగు లిటరేచర్ని పెట్టారట గదా భీమవరంలో.

**ఉషశ్రీ:** నిజం నీవన్నది నిజం నిజం. భీమవరం కాలేజీలో పెద్దాడ రామస్వామి గారి వక్తృత్వ వైభవాన్ని కళ్ళారా చూసి మనసార గ్రోలి ఆనందించాను.

**మధుర:** సంప్రదాయ అభ్యుదయ విప్లవ మార్గాలకి జీవితం సాహిత్యం వారధిగా ఉండాలని మీ వాదన కాబోలు. ఇవి పరస్పర విరుద్ధాలు కదా.

**ఉషశ్రీ:** పైకి అలా కనిపించినా అంతరంగం అట్టడుగున అంతమందీ మానవులం అన్నట్లు అంతా ఒకటే. అభ్యుదయ పరంపరాభివృద్ధి అంటే అదే.

**మధుర:** సూర్యోదయం అని నాటకం రాసి ఇప్పుడు దేశమంతా భువన విజయాలు సార్థకం అయేలాగున చేసింది మీరేనటగా. యు ఆర్‌ది గాడ్ ఫాదర్; లేక-పయొనీర్.

**ఉషశ్రీ:** ఆ పాపం కూడా నాదే. ఏవృత్తిలో పుట్టిన వాడు అనువంశికంగా ఆ వృత్తినే అవలంబిస్తే అతని జీవితానికి రక్షణ ఏర్పడినట్టే కదా. వృత్తి విద్యలను కాదనబట్టే మనకీనాడు ఈ దుస్థితి. మానవత్వం ముందు, ధనం తర్వాత;. అన్న దృక్పథం ఏర్పడితే సమాజం ఆరోగ్యవంతంగా ఉంటుంది.

**మధుర:** డబ్బుకోసం ఏ పనికైనా సిద్ధపడే మనస్తత్వం రాక్షసప్రవృత్తికి దారి తీస్తుంది. డిగ్నిటీ ఆఫ్ లేబర్ అత్యున్నత స్థానంలో ఉంటే ఆ సమాజం ఉన్నతంగా ఉంటుంది, పైన పనస ముళ్ళు, లోన తీయన తొనలే, మొగలి రేకు కున్న ముళ్ళ భంగి, మనసు వెన్నపూస మాట కారప్పూస. చెలగు శ్రీ ఉషశ్రీ-

**ఉషశ్రీ:** నన్ను ములగ చెట్టు ఎక్కించకు.

**మధుర:** అన్నీ ఒకెత్తు, అగస్త్యుడొక్కడూ ఒకెత్తు అన్నట్లు మీరు మీరే. కాలం, మనుషులు, దేశం-మారినా మనుషుల మూల తత్త్వాలు ఒక్కటే. గనుక రామాయణ మహాభారతాలు పాతవైనా కొత్తవే.

**ఉషశ్రీ:** శ్రీశ్రీనీ కృష్ణశాస్త్రినీ విశ్వనాథనీ సమానంగా అభిమానించి చేతులు కాల్చుకున్న పిచ్చివాడ్ని.

**మధుర:** సిగరెట్లు తాగుతాడని మడికట్టుకున్న వాళ్ళు, బొట్టు పెట్టుకుంటాడని కుర్రాళ్ళూ, అభ్యుదయ నిరోధకుడని అభ్యుదయంగాళ్ళూ కలిసి లెక్క చేసుకుంటారు మిమ్మల్ని, మీ చేత తిట్టించుకోవడం కూడా కుర్రాళ్లకు సరదా.

**ఉషశ్రీ:** (నవ్వుతాడు)

**మధుర:** మీరు నవ్వితే భీమవరం నవ్వి నట్టు ఉంటుంది.

**ఉషశ్రీ:** నువ్వునవ్వితే విజయనగరం నవ్వినట్లు ఉంటుంది.

**మధుర:** గాంధీగారు పోయినపుడు ఆ జనశోక సాగరం మధ్య సాక్షీభూతుడులా డిమెల్లో వ్యాఖ్యానం చేశాడు.

**ఉషశ్రీ:** అతనే నాకాదర్శం. కోహం? సోహం. దాసోహం.

**మధుర:** మీకు ఏ యూనివర్శిటీ డిలిట్‌గాని కళాప్రపూర్ణ గాని ఇవ్వలేదేమి?

**ఉషశ్రీ:** 1976లో జిల్లెళ్లమూడి అమ్మ అమృత హృదయం అందుకున్నా. 1987 ఏప్రిల్‌లో శృంగేరీ శారదా పీఠాధిపతులు అమ్మవారి సమక్షంలో సత్కారం చేశారు. కులాల వారీగా చేసే కళాప్రపూర్ణలాంటి సత్కారాలు నాకెందుకు?

**మధుర:** మీరెందుకు పనికివస్తారో అందుకు మిమ్మల్ని ఉపయోగించుకున్న దెవరు?

**ఉషశ్రీ:** 'స్వర్గ సీమ' సినిమాకోసం 'ఓహో పావురమా' పాటరాసిన రజనీకాంతరావుగారు.

**మధుర:** హైదరాబాద్ వదిలారు మీరు బాగుపడ్డారు. గిరీశం లాటి వారికి సరిపడ్డట్లు మీకు సరిపడదు. కాకినాడ, రాజమండ్రి, భీమవరాలలో మీరు ఉపన్యసిస్తూంటే కొత్త సినిమా విడుదల నాడు హాలులో లాగజనం దేవాలయాలలోనిలబడి వింటం నాకు తెలుసు.

**ఉషశ్రీ:** మనిషికి విజ్ఞానంతో పాటు సంస్కారం కావాలి. గవర్నమెంటు రిజర్వేషన్లు ఇవ్వగలదు గాని సంస్కారం ఎక్కడ్నుంచి ఇస్తుంది. దానికేలేదే?

**మధుర:** మతం ఈ జాతి జీవ రక్తం.

**ఉషశ్రీ:** మతం, భాష, పరిపాలనా వ్యవస్థ కలిపి జాతి అవుతుంది. రాజకీయం మనకు ప్రాణం కాదు. మతం ప్రాణం.

**మధుర:** అయితే నెహ్రూ గారి సెక్యులరిజాన్ని మీరు ఆమోదించారా?

**ఉషశ్రీ:** హిందూ మతంలోనే ఉంది ఆ సెక్యులర్ తత్వం.

**మధుర:** సంస్కృతం మన అధికార భాష కావాలంటారు. అవునా?

**ఉషశ్రీ:** జాతి ప్రతిష్ఠను పెంచి మనకు శక్తి నిచ్చేది అదే, హిందీ కాదు.

**మధుర:** బాహ్య ఆడంబరాలేవీ మతం కాదు. మనస్సు నిర్మలంగా ఉండాలి.

**ఉషశ్రీ:** విశ్వ జనీనత మన మతానికి ఉన్నట్లు ఏ మతానికీ లేదు. ఒక వ్యక్తి మీద ఆధారపడి అతని చుట్టూ అల్లిన కథలు కాదు మన మతం. నీవెవరో తెలుసుకో. అన్నిటి కంటే ఆత్మ సాక్షాత్కారం ముఖ్యం. అహం బ్రహ్మాస్మి.

**మధుర:** అయితే బుద్ధుడ్ని మీరు అంగీకరించరా?

**ఉషశ్రీ:** ఆత్మ పరమాత్మ అంగీకరించడు బుద్ధుడు. అతీంద్రియానుభవం ఉందంటాడు. యుక్తికి అతీతంగా నడచిన వాడే ప్రవక్త.

**మధుర:** ఇతరుల నుంచి మనం నేర్చుకోవలసినది ఏమీలేదా?

**ఉషశ్రీ:** నేను సర్వజ్ఞుణ్ని, నాకే అంతా తెలుసునని ఎవరైనా అనుకుంటే వారు మరణించినట్లే. గౌరవ ప్రతిష్ఠలు మనస్సు పెరిగి ఎత్తు మీద నీ వివేకం మీద ఆధారపడి ఉంటాయి.

**మధుర:** (నవ్వుతూ) అయితే మనిషి మనిషిలా బతకాలంటారు మీరు. శ్రీమంతుల చేతిలో పరిపాలనా చక్రం ఉంటే వాళ్లు సామాన్యులను పీల్చి పిప్పిచేస్తారు. దోపిడీలు చేసి భోషాణాలు నింపుకుంటారు.

**ఉషశ్రీ:** జాతి ధర్మాన్ని సక్రమంగా అనుసరించినంత కాలం ఏ జాతికీ కీడు లేదు.

**మధుర:** ఈ మతాన్ని వదిలి మనప్రాణ శక్తిని సాంఘిక, రాజకీయ, ఆర్థికాదుల వైపు మళ్లిస్తే-

**ఉషశ్రీ:** అది ప్రకృతి సహజం కాదే. ప్రకృతికి విరుద్ధంగా నడచి మనం బ్రతక గలమా? నీ డ్యూటీ నువ్వు దీక్షగా చెయ్యి. ఫలితం గురించి ఆలోచించకు. కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన-

**మధుర:** కుడి చెంప మీద కొడితే ఎడమ చెంప చూపించ మన్నాడు గదా ప్రభువు.

**ఉషశ్రీ:** చూపించు. కర్తవ్య పరాయణుడవై కర్మను ఆచరించటం నీ విధి. ధర్మార్థ కామమోక్షాలన్నారు. మోక్షం ఒక్కటే చెప్పలేదు మన వేదం. మొదటి మూడూ అనవసరం అనుకుంటే ఎలా?

**మధుర:** ఔను. నిజం. నీవన్నది నిజం, నిజం.

**మధుర:** మీరు ఎవరికీ తలవంచలేదా?

**ఉషశ్రీ:** రేడియోలో నేను తలవంచ లేదు. సాష్టాంగ పడింది ఒకే ఒక్కరికి. దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారికి. నాలుగు దశాబ్దాలు బాల వ్యాకరణం పాఠం చెప్పిన వ్యక్తి వారు. డెబ్బయ్యో పడిలో రేడియోకు శ్రీనివాసన్ గారు రప్పించారు.

**మధుర:** అక్కడ చిగురు కొమ్మయిన చేవ.

**మధుర:** మీ పూర్తి పేరు?

**ఉషశ్రీ:** పురాణ పండ సూర్యనారాయణ దీక్షితులు

**మధుర:** గురువు?

**ఉషశ్రీ:** తండ్రిగారైన రామ మూర్తిగారే.

**మధుర:** చేతి డబ్బుల్తో పత్రిక నడిపారట-

**ఉషశ్రీ:** ఏ సముద్రం ఎప్పుడు మేలు కుంటుందో ఎవరు చెప్పగలరు. విశ్వశ్రీ విశ్వనాథ సాహిత్య సంచిక వేశా.

**మధుర:** మిమ్మల్ని భీమవరం కాలేజీ నుంచి పంపించేశారట.

**ఉషశ్రీ:** పురాతన సంస్కృతికి వారసుడ్ని కదా. మా అమ్మగారి వస్తువులు తాకట్టు పెట్టి విశ్వశ్రీ వేశాను.

**మధుర:** మీరు మందు పార్టీల్లో కూడా స్వస్తి అని నియమ పాలన చేస్తారట. మీ వాగ్ధోరణికి గురువులు-

**ఉషశ్రీ:** మా నాన్నగారే.

**మధుర:** నహి కస్తూరి కాచారః శపథేన నివార్యతే (ఒట్టు పెట్టి కస్తూరి వాసనను వ్యాపించకుండ ఆపలేం)

**ఉషశ్రీ:** పూర్వం నేను వాల్మీకుల తపోవనంలో మొక్కలకు నీళ్ళు పోసి ఉంటాను.

**మధుర:** మీరు ఎవర్ని తిడితే వారు అడిగి కావాలని మళ్ళీ తిట్టించుకుంటున్నారు. సణుక్కున్న వారే మిమ్మల్ని నెత్తిన పెట్టుకున్నారు. యువకుల్ని సైంధవులని, కీచకులనీ తిట్టే వారట గదా!

**ఉషశ్రీ:** మనల్ని తిట్టేవారే మనల్ని ప్రేమిస్తారు; పొగిడేవారు కాదు.

**మధుర:** శ్రీమత్పురాణపండ నదీమత్ సూర్యప్రకాశ దీక్షిత! దీవ్యత్ రామాయణ భారతగాథా మహితార్థ కథన దక్షా! జయహో!



*(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక : 21-08-1996)*

# సింగిరెడ్డి
# నారాయణ రెడ్డి తో



**మధుర:** మిమ్మల్నీ దాశరథినీ ఉద్దేశించి చలంగారు ఎవరీ శ్రావణ భాద్రపదాలు అన్నారు.

**సినారె:** అవధానాలు చెయ్యకపోయినా మేం జంట కవుల సంప్రదాయాన్ని పాటించాం... నాకు చలం గారితో పరిచయమయితే లేదు.

**మధుర:** హైదరాబాద్ వచ్చే యాత్రికులు చూడవలసిన వాటిల్లో ''నారాయణ రెడ్డి'' కూడా ఒక ఎజెండా ఐటమ్ అని అనుకోడం విన్నాను...వండర్స్ ఆఫ్ ది హైదరాబాద్‌లో మీరు.....

**సినారె:** అదీ ఓ కాంప్లిమెంటే-

**మధుర:** శివుల్లా మీరు భక్తజన సులభులని విన్నాను. అందరికీ ఆశ్రయమిస్తారనీ అందరికీ అందుబాట్లో వుంటారనీ తెలిసింది.

**సినారె:** నేను సామాన్యుల్లో సామాన్యుడిగా మాన్యుల్లో మాన్యుడినిగా వుంటా. అదినాకు చాలా ఇష్టం.

**మధుర:** మీరు చాలా అందమైన వారు....

**సినారె:** (నవ్వు) నా అందాన్ని నేను మెచ్చుకోటం బాగుండదు. నా అందాన్ని కన్నా నా కవిత్వాన్ని ఎవరైనా మెచ్చుకుంటే సంతోషిస్తా.

**మధుర:** మీరు ఆస్తికులా, నాస్తికులా?

**సినారె:** నేను మూఢనమ్మకాలకూ మూఢాచారాలకూ వ్యతిరేకిని.

**మధుర:** కవుల్లో మీరూ శేషేంద్ర శర్మగారూ అందగాళ్లని ఒప్పుగుంటారా లేదా, చెప్పండి.

**సినారె:** ఒప్పుకోకపోతే డేంజరు.

**మధుర:** గిరీశంగారు డాబులరాయుడేగాని మందు పుచ్చుకోరు.

**సినారె:** నేను డాబులరాయుణ్ణి కాను; మందు పుచ్చుగుంటాను.

**మధుర:** అన్ని ప్రభుత్వాలతోనూ మంచిగా వుంటూ అందరికీ యిష్టంగా నడుచుకోవడం కష్టంగాదూ?

**సినారె:** మంచివాళ్లతో మంచిగానూ చెడ్డవాళ్లకి దూరంగానూ ఉండమని కదా, మీ అమ్మనీకు చెప్పింది? నేను చెడ్డవాళ్లతో కూడా మంచిగా వుంటాను.

**మధుర:** మీరు కొంత నా పోలికే....

| **సింగిరెడ్డి నారాయణ రెడ్డి** |
|---|

**సినారె:** నీతో స్నేహంగా ఉండమంటే వుంటా; దయచేసి పోలికలు తేవద్దు.

**మధుర:** మీరు సైతం సానులకి భయపడుతున్నారే! సానులు మాత్రం మనుషులు కారా; వారికి మనసుండదా!?

**సినారె:** నువ్వు సౌజన్యారావు పంతుల్నే బురిడీ కొట్టించావు....నే ననగా యెంత?

**మధుర:** మీ దగ్గిర చదువుకొనుంటే నేను మంచి పండితురాలినయ్యేదాన్ని, అప్పుడు నన్నందరూ డాక్టర్ మధురవాణి అనుండేవారు...ప్చ్!

**సినారె:** ఆర్నెల్లు సావాసం చేస్తే వారు వీరవుతారు. నువ్వు డాక్టరువి అయినా కాకపోయినా గురజాడ వారి ముద్దుల బిడ్డవు; ఆయన బ్రెయిన్ ఛైల్డువి.

**మధుర:** మీ దగ్గర చదువుకున్న వారు అహ్హో, ఒహ్హో-అంటారట. ఎమ్వీయల్ మిమ్మల్ని తెగ మెచ్చుకునేవాడు.

**సినారె:** చదువు చెప్పడం నా వృత్తి. కవిత్వం నా ఊపిరి.

**మధుర:** వాణి నా రాణి-అని మీ శ్లేదు గానీ అంటే మాత్రం మిమ్మల్ని కాదనేవారెవరంట!

**సినారె:** కవిత్వం రాయని రోజు నాకు దుర్దినంలా వుంటుంది.

**మధుర:** పూర్వం 'పొద్దునియమం' ఉన్నవాళ్లు సూర్యుడు కనపడనిరోజు భోజనమే చేసేవారు కాదు...

**సినారె:** ''కవిత గలిగిన రాజ్యాధి కారమేల?''

**మధుర:** మంచి కొటేషను....మీటింగులూ సన్మానాలూ పూలదండలడలూ లేకపోతే మీకు తోచదట. ఎవరు పిలిచినా వక్తగానో అధ్యక్షుడుగానో ముఖ్యఅతిథిగానో వెళిపోతారుట; ఆఖరికి స్వీట్స్‌షాపు ప్రారంభోత్సవానికయినా సరేట-

**సినారె:** నా కన్నివర్గాల్లోనూ మిత్రులున్నారు...నువ్వే అన్నావుగా, నన్ను శివుడితో పోల్చి; భక్తసులభుడినని!?

**మధుర:** మీకు అన్నీవున్నాయి, మీరు అన్నీ పొందారు; అనుభవించారు. మీకు లోటులేదు. తృప్తిగా ఉన్నారనుకుంటా.

**సినారె:** నేను ఎలా ఉన్నానో నాకు తెలుసు; నా అంతరాత్మకు తెలుసు. సుఖంలో సుఖంలేదు.

**మధుర:** మీరు (మీ) జీవిత చరిత్ర ఎందుకు రాయలేదు?

**సినారె:** జాగ్రత్తగా చూస్తే నా కవిత్వం నిండా నేను పరుచుకొని వున్నాను. మళ్లీ రాయటం దేనికి?

**మధుర:** మీరు వచన రచనలు చెయ్యలేదేం?...పైగా ఇది వచన రచనాయుగం కూడాను.

**సినారె:** నేను వచన కవిత్వం బోల్డు చెప్పా.

**మధుర:** నే నడిగే దొకటీ మీరు చెప్పేదొకటీనీ. కాలికేస్తే మెడకీ, మెడకేస్తే కాలికీ వెయ్యడం మీకు సరదావా?

**సినారె:** నీకు కోపం వచ్చినట్లుంది... అయినా అదీ వోసొగసే-

**మధుర:** మీ సినిమాపాటలు నాకిష్టం. అది సరేగాని; పాట-అనేది ఎవరేనా రాయమని అడిగినప్పుడు రాయడం కష్టమూ యాంత్రికమూ అయిపోదండీ; నాకు తెలీకడుగుతానూ?

**సినారె:** దానికీ కొంత ఘర్షణ వుంటుందనుకో; అయితే, అది లోపల! నిరంతరం కవితోపాసన చేసేవారికి సినిమాపాట రాయడమనేది కవిత్వం మేడీజీ యే తప్ప కుప్పుస్వామయర్ మేడ్ డిఫికల్ట్ కాదు. గిరీశం గారు సినిమాఫీల్డు లో కొస్తే మంచి సినిమారైట రయ్యుండేవాడు.

**మధుర:** మీరు ఫీల్డులోకి రావడం సినిమాప్రపంచంలోకి సరస్వతీ రంగప్రవేశం.

**సినారె:** నీ కామెంటులో కొంత నిజం వుంది. నేను సాహితీపరుణ్ణి కాబట్టి సాహితీ ప్రపంచం అక్కడ కూడా నాతో ఉంటుంది; వాగర్థావివ సంపృక్తౌ అన్నట్లు.

**మధుర:** మీ వ్యక్తిత్వం లో కొంతస్త్రీత్వం కనిపిస్తూ వుంటుంది, గమ్మత్తుగా!

**సినారె:** ప్రతికవీ అర్థనారీశ్వరుడననుకాని, అర్థనారి, అర్థ ఈశ్వరుడూ మనిషిలో ఉండకుండా ఎలా?

**మధుర:** మీరు రాసిన సినిమాపాట ఏదైనా రేడియోలో వస్తున్నప్పుడు మీ కేమని పిస్తుంది?

**సినారె:** ఆ సన్నివేశం గుర్తుకొస్తుంది.

**మధుర:** అప్పట్లో సన్నివేశాలకీ పాత్రల మనస్తత్వాలకీ అన్వయించేటట్లుగా పాటలు రాయమని అడిగేవాళ్లు గాబోలు, ప్రొడ్యూసర్లో డైరెక్టర్లో.

**సినారె:** అవును. అవన్నీ కవితా రూపంలో వ్యక్తమయ్యే పరస్పరాభిప్రాయాలు. అంటే- ఒక డ్యూ ఎట్ వుందనుకో; అందులో పల్లవి అలావదిలేస్తే స్త్రీపాత్ర చరణాలూ పురుషపాత్ర చరణాలూ వుంటాయి కదా. అవికూడా డైలాగులే, ఎటొచ్చీ కవితాత్మకంగా,. వాటిని అన్నవాళ్లకీ విన్నవాళ్లకీ ఆహ్లాదకరంగా రూపొందేవి. ఫలానా సందర్భం, ఫలానా సన్నివేశం అని కవికి వివరంగా చెప్పేవారు. ట్యూను సుమారుగా యిదీ అని వినిపించేవారు.

**మధుర:** అర్జంటుగా రాసిచ్చేమనేవారా?

**సినారె:** అర్జంటుగా రాసిచ్చేమనే వాళ్లూ ఉండేవారు; అర్జంటుగా రాయగలిగేవారూ ఉండేవారు. టేక్‌యువర్ ఓన్‌టైమ్ అనేవాళ్లూ ఉండేవారు; నెలల తరబడి టైమ్‌తీసుకునేవారూ ఉండేవారు

**మధుర:** మీలాగా, ఆత్రేయ గార్లాగానా? మీరు శుక్రవారం ఫ్లయిట్‌లో మద్రాసు వెళ్లి శనాదివారాలు అక్కడుండి నాలుగో ఐదోపాటలు రాసేసి ఆదివారంఫ్లయిట్‌లో హైద్రాబాదొచ్చేసి సోంవారం క్లాసులు చెప్పేవారట. అర్జంటుగా రాసినా చాలా బాగారాసేవారు· మీరు. మీ రెగ్యులర్ కవిత్వంలాగే మీ సినిమాపాటలు కూడా విశ్లేషణకి అనువైనవి.

**సినారె:** అవును, పాత సినిమాల్లో ఏసందర్భానికి ఏ పాట ఎట్లావ్రాశారు; ఏపాటలో ఏభావం ఎంత కవితాత్మకంగా వచ్చింది అనేవిషయాల్ని ఉదహరిస్తూ కొన్నాళ్లకిందట భరాగో కొన్నివ్యాసాలు రాసేరు. అతనోసారి నాద్వారా ఒక ఎవార్డు అందుకున్నప్పుడు తారసపడ్డాడు. ముప్పయి వ్యాసాల వరకూ వ్రాసినా ఇంకామీకు సినారె, దాశరథి, ఆరుద్ర తగల్లేదా అని అడిగా.

**మధుర:** మీరూ దాశరథీ ఆరుద్రా ప్రవేశించాక సినిమాపాటలో కవిత్వపు విలువలు అలా ఉంటూనే చాదస్తం పోయిగడుసుతనమూ ఆధునికతాక్లుప్తతా వొచ్చేయని భరాగో వ్రాశాడు. ఆవ్యాసాలు ఇప్పటి రీడర్సు కొందరికి ఎక్కడంలేదని ఆ ఎడిటర్‌గారు వాట్ని ఆపించేశార్ట. మా పురాణంగారు మరికొన్ని రాయించారుగాని ఆ పత్రికే ఆగిపోయింది. కానీ, అది అలా కంటిన్యూ అయ్యుంటే మాత్రం మీ పాటలున్న సినిమాల్ని గురించి కనీసం పది వ్యాసాలైనా వచ్చుండేవి.

**సినారె:** ఒక కవి రాసిన సినిమా పాటల్ని పుస్తకంగా తీసుకురావడం అనేదుంది. ఆరుద్రవి, శ్రీశ్రీవి, నావి- ఇలా కొన్ని వచ్చాయి. కాని, సినిమాపాటలకి విద్వద్విశ్లేషణ అనేది మరికొంచెం శాశ్వతమైన గౌరవం. పైడిపాల థీసిస్‌లో ఆపని కొంత జరిగింది.

**మధుర:** అలా విశ్లేషిస్తే మీ కవిత్వం గురించి ఎన్ని పుస్తకాలు రావాలో!

**సినారె:** అంటే!

**మధుర:** కర్పూర వసంతరాయలు నుంచి సాగిన మీ కవితాయానంలో ఎన్ని భౌగోళిక, భౌతిక, తాత్త్విక, ప్రాపంచిక, ఔత్సాహిక మజిలీలు; ఎన్ని వైవిధ్యాలు! ఈమధ్యటూ-ఇన్-వన్ లూ త్రీ- ఇన్-వన్ లూ అని వస్తున్నాయి కదా. మీరు మెనీ- ఇన్-వన్ అంటాను.

**సినారె:** ఇంగ్లీషులో ''జాక్ ఆఫ్ ఆల్ ట్రేడ్స్'' అని వొకటుంది. అదికాబోలు, నీ వెక్కిరింపు. అను; అను!....కానీ, ''పద్దు వారికి చేటు వాటిల్లదెపుడు!''

**మధుర:** బహుముఖ ప్రజ్ఞాశాలీ, శీలీ, శూలీ-కూడా కదా మీరు! ఎట్నుంచి నరుక్కొచ్చినా కవిత్వమే కారుతుంది.

**సినారె:** ఎక్కడైనా ఒకచోట వెలితి అనేదుంటే దాన్ని యితర శక్తులు భర్తీచేస్తాయి. కాలాన్ని జయించాలని సినారె కావ్యానికి దాహం.

**మధుర:** గజల్ అన్నారే-అదేమిటది?

**సినారె:** ప్రియురాలితో సల్లాపం. ఇంకా చాలా మీనింగులున్నాయి. ప్రాయికంగా యిది శృంగార పరం

**మధుర:** మీరు ఏపాకిస్తాన్‌కో రాయబారిగా వెళ్తే ఈ ఉర్దూ పర్షియన్ సంప్రదాయ కవితలు మరింత ప్రఖ్యాతిని పడేవి. అలాకాక ఏస్విజర్లాండుకో ఎంబాసిడర్‌గా వెళ్లుంటే మన దేశానికి సాహిత్యంలో మరో నొబెల్‌ప్రైయిజు తెచ్చేసుండేవారు.

**సినారె:** అవన్నీ ఆలోచించవలసిందీ తేల్చవలసిందీ నువ్వూనేనూ కాదు.

**మధుర:** మీ రెక్కడానికి ఈ దేశంలో ఇంకే కుర్చీలూ లేవు; అందుకని అంటున్నాను.

**సినారె:** బాగుంది నీ వేళాకోళం!

**మధుర:** 'ఏవమ్మా, తెలుగమ్మా; ఎక్కడ నీ చిరునామా?' అన్నారుగా, మీరు!

**సినారె:** వచ్చినాడు, వచ్చాడు, వచ్చిండు- ఏద్దైతేనేం? పరిపాలనలో తెలుగుపెరగాలి నిండుగా.

**మధుర:** మీకు విగ్రహారాధన అంటే మక్కువ లేదటగా

**సినారె:** నేను ఎవర్నీ ఆరాధించను. ఆరాధనాతత్వం లేదు, నాలో, నిజంగా.

**మధుర:** మీ బొమ్మ ఒకటి మీ ప్రతీ పుస్తకం మీదా ఉంటుంది. ఎందుకు, అలా వెయ్యడం?

**సినారె:** ఓ, అదా? నా అభిమానులు నా పొయిట్రీనీ నా ఆకారాన్నీ కూడా ఆరాధిస్తారు.

**మధుర:** మీకు మీ బొమ్మంటే పరమ ప్రీతి. అది ఒరకంగా ఆత్మస్తుతీ నార్సిసిజమ్.

**సినారె:** ఎవరి అందాన్ని వారు ప్రేమించుకోవటం స్త్రీలకు మాత్రమే జన్మహక్కా?

**మధుర:** చిన్నప్పుడు హరికథలు మిమ్మల్ని బాగా ఉత్తేజపరిచాయనుకుంటాను...

**సినారె:** అవిమనకి వాకీ టాకీ యూనివర్సిటీలు. హరికథలూ పురాణాలూ భాగోతాలే మన్ని ఎడ్యుకేట్ చేసేయి.

**మధుర:** మీ యాభై సంవత్సరాల పండగ చేసుకున్నప్పుడు మీరన్నది నాకు జ్ఞాపకం వుంది!

అమ్మగ సింగిరెడ్డి బు
చ్చమ్మగ కమ్మగ నను
పెంచిన మా హనుమాజీ
పేటకు ఈ సన్మానం!

**సినారె:** నేను పాలేర్లతో బాటుగా నేల దున్ని పనిచేశా.

**మధుర:** మీ 'పశులపోని' కవిత మిమ్మల్నీ మీ కవితల్నీ వెలుగులో ముంచింది. మీ Roots ఎక్కడున్నాయో చెప్పింది.

**సినారె:** ప్రతి చెట్టుకీ వేళ్లుంటాయి; మూలాలుంటాయి. కొందరు చెప్పుకుంటారు; కొందరు కప్పెట్టుకుంటారు.

**మధుర:** అంబలిలో చింతతొక్కునంచుగుని జుర్రాలని నాకూ అనిపిస్తుంది. అర్బనైజేషన్నించి అంబలీ తోపా మర్చిపోయేం. 'సన్నజాజీ పూలమాలా' మంచి ఎలిజీ. మీరు అలవోకగా రాసిన 'తెలుగు వాడు' ఎన్నిసార్లు చదువుకున్నా సరే; ఆ చెప్పిన సంగతులకి ఒళ్లు పులకరిస్తుంది. మాగాయి టెంక పెరుగులో ముంచుకున్నట్టుంటుంది ఆ కవిత. సంవత్స రానికో కాపులాగా కావ్యాలపంటలొస్తే కవిత్వం ఎక్కువ రాశారనుకుంటారు.

**సినారె:** నాకు అలా కనిపిస్తుందీ, అనిపిస్తుందీ. రాయగలను గాబట్టి రాస్తాను. కవిత్వం కొంచెమేరాయాలి. ఎక్కువ రాయకూడదూ అని రూ లేదైనావుందా?

**మధుర:** విశ్వనాథ సత్యనారాయణగారు నవలలు, కథలు, విమర్శలు, కవితలు; రామాయణ కల్పవృక్షంతో సహా ఎన్ని ఉదయింపజేశారో! ఫారిన్‌లో అయితే ఆ పుస్తకాల మీద వచ్చే రాయల్టీలతో మూడు తరాల వాళ్లు సునాయాసంగా కాలుమీద కాలేసుకొని బతికే గలరు.

**సినారె:** నేను ఆధునిక వచన కవిత్వం ఎక్కువ రాశా. అన్నీటచ్ చేశాననుకో.

**మధుర:** మీరు నవలలూ కథలూ రాయకపోయినా కర్పూర వసంత రాయలు రాశారుగా. సమప్‌చేస్తే మీరు దారితప్పిన గంధర్వుడు లాంటివారు.

**సినారె:** మధురవాణి పొగడ్త రెండు వైపులా పదును. ఎత్తేస్తావో కిందపడేస్తావో తెలీదు.

**మధుర:** మీరు నేలతల్లి ముద్దుల బిడ్డ. కిందపడ్డా లేచినిలబడి జండా యెగరెయ్యగల్రు. అవునూ, మీ కవిత్వాలు పరిశీలిస్తే మీరు కాస్సేపు తీవ్రవాదం వేపు, కాసేపు గవర్నమెంటు పక్షం, కొంత ఎన్.టి. ఆర్ సైడింగు యిలా అన్ని వుద్యమాల దిక్కులకీ పొద్దు తిరుగుడుపువ్వులా మొహం తిప్పుతూ వుంటారనిపిస్తుంది. మీరు దేనికి కట్టుబడి వుంటారో అంతా అయోమయం.

**సినారె:** ఎవరయినా మనసు చెప్పినట్లు వ్యవహరిస్తారు కదా! మనసొకచోట, మనిషొకచోటగా ప్రవర్తించటం సబబుకాదు. మనసు గుఱ్ఱము రోరి మనిసీ-అన్నారు విశ్వనాథ.

**మధుర:** మానస వనచర వర సంచారము-అని త్యాగరాజు. అంటే మనస్సు గుఱ్ఱం కాదు, కోతి అని. పోనీలేండి, కోతో, గోడమీద పిల్లో-గవర్నమెంటుకీ పాలకవ్యవస్థకీ కమిట్ అయిరాసే వాళ్లు భజంత్రీలూ భట్రాజులూ తప్ప వైతాళికులు కాలేరంటారు; అందుకని అడిగాను.

**సినారె:** నేను వైతాళికుణ్ణే అవునో కాదో నాకు తెలీదు గాని భజంత్రీనీ భట్రాజునీ మాత్రంకాదు. ఇతరులు అనుకునే దాన్ని మనం ఎలా సమర్థిస్తాం, ఎలావ్యతిరేకిస్తాం?

**మధుర:** మీ ఆవేశానిది ఒకదారీ, మీ వ్యక్తిత్వానిది మరొకదారీ లా కనిపిస్తోంది.

**సినారె:** దానికీ నేనిప్పుడు చెప్పిందే జవాబు.

**మధుర:** ఆకృతికీ ఆశ్రుతికీ ప్రతీక సరస్వతి అన్నారుగా, మరి?

**సినారె:** అలా కూడా నా దారికే వచ్చావు, చూసుకో...నాహృదయం ఒకకెలిడోస్కోపు. నాకలం ఒక జీవనది. నా కళ్లు ఎక్స్‌రే కంటే లోతుగా చూస్తాయి. నేను ద్రార్శనికుణ్ణి.

**మధుర:** జయదేవుడు అష్టపదులు రాస్తే మీరు పంచపదులు ఏవో రాశార్ట.

**సినారె:** పంచ పదులు కావవి, 'ప్రపంచ-పదులు'. శబ్ద-లయ-భావ-స్పందనలు గల ఒక విలక్షణమైన వ్యక్తీకరణం. ప్రపంచించి-అంటే విస్తరించి చెప్పడం. ఇవి విశేషమైనవి. లోక తత్త్వాన్ని వివరించి విశ్లేషించేవి.

**మధుర:** వేమన పద్యాల్లా...

**సినారె:** నాదృష్టిలో రుబాయీ వుంది. దానికి ఐదో పంక్తిని జోడించా.
ఎన్నిమెట్లు ఎక్కానని కాదు, ఎంత ఎత్తుకెదిగావనీ;
ఎన్నిమునకలేశానని కాదు, ఎంతలోతు చూశావనీ;
గమనం సార్థక మౌతుంది నీ గమ్యాన్నిచేరినప్పుడే
ఎన్ని సభలు తిరిగావనికాదు, ఎంతబుద్ధి పెంచావనీ
ఎన్ని కృతులు చదివావనికాదు, ఎంతసిద్ధిపొందావని!

**మధుర:** బురదలోన వుంటున్నా తరగదు పద్మం విలువ
తాటాకున పడివున్నా తగ్గదు పద్యం విలువ
అసలు సిసలు పసవుంటే అవరోధించేదెవరు?
అరసికులేమంటున్నా చెరగదు గానం విలువ
మూర్ఖులు ముంచేస్తున్నామునగదు జ్ఞానం విలువ!

★ ★ ★

ఏది చూసినా లోతును ఇట్టే పసికట్టాలి
ఏదిగీసినా కంటిని ఇట్టేచెరపట్టాలి
ఏదోఫరవాలేదని ఎందుకు ఆ గిట్టింపు
ఏది రాసినా గుండెను ఇట్టే గిలకొట్టాలి
ఏదిచేసినా లోకం ఇట్టే జే కొట్టాలి!

నేనూ గిరీశం గారూ మీప్రపంచపదులు చదివి అబ్బో అనుకున్నాం, ఓ రబ్బోఅనుకున్నాం.

**సినారె:** అంటే, నా ప్రపంచపదులు గిరీశాలూ వెంకటేశాలూ చదువుతారని దెప్పి, వెక్కిరింపా?

**మధుర:** మీరు మాటల కోటీశ్వరుడు. నడుమ బట్టగట్ట నగుబాటు కాదొకో అన్నాడు వేమన. మీకూ వేమనకూ అదే, తేడా.

**సినారె:** నీ పోలికలూ మెలికలూ చాలించు, నేను పదచిత్రణమాత్ర జీవిని.

**మధుర:** 'అమ్మబొమ్మ' అనిరాసిన అమ్మజ్ఞాపకాలు అమ్మంత కమ్మగా బావున్నాయి. గురజాడ ముత్యాల సరం కనిపెడితే మీరు ప్రపంచపదులు విస్తరించేరు. మీరు పూర్తిగా గురజాడ మార్గాన్నే ఫాలో అయ్యారా?

**సినారె:** నాది గురుజాడ అడుగుజాడే. అయితే మేవంతా సంప్రదాయ కవిత్వం, భావకవిత్వం, అభ్యుదయ కవిత్వం-యీ ధోరణుల్లోంచి నడిచి వచ్చాం. మామీద అనేక గాలులు వీచాయి. పాతేసిన నమ్మకాల స్తంబాల్లాకాక, మార్పును పేర్చుకునే హరిత మూర్తుల్లా జీవించినప్పుడే మనం మనుషుల మనిపించుకుంటాం.

**మధుర:** 'అప్పటికతడు మంచివాడే' అనే కవితలో ఓ కథ చెప్పారు. అది నిజంగా ఓ నవలకు సరిపోతుంది. దాంటో ప్రపంచపు బాధంతా పలికించేరు. 'సూర్యప్రభద్యుతి

లేనిది, సహజప్రభ మృతిలేనిది' - అని అన్నారు. 'శం చావదు; మట్టై బతుకుతంది!' అన్న ఆశావాది, మీరు. అయితే, కవిత్వం తోనూ రాసిన దాంతోనూ తృప్తి పడివూరుకోడం సవ్యం కాదనుకుంటాను.

**సినారె:** నీ ఉద్దేశం నేను తుపాకీ పట్టుకుని ఏ అడవుల్లోకో వెళ్లుండవలిసిందనా?

**మధుర:** వ్యవస్థపై ఆగ్రహం అక్షరాల్లో మాత్రం ప్రదర్శిస్తే చాలదు. సర్పంబు పడగనీడను కప్పవసించిన విధంబుగదరాసుమతీ అవుతుంది.

**సినారె:** మన మంతా అలాగే జీవిస్తున్నాం. నేను ధర్మామీటర్నేగాని జ్వరం తగ్గించే మాత్రను కాను.

**మధుర:** మీ శైలిని చూసి కంగారు పడి మీరు "అధర్మా' మీటర్ మోనని భయపడ్డాం. మీరు ఉత్తరకుమారులు కారు, అర్జునులే. కాని, గాండీవం యింకా ఎక్కుపెట్టలేదు.

**సినారె:** దూసుకుపోయే యుగ ప్రగతి ఆగిపోరాదు. అలసిపోయినారక్తం రంగు వెలిసిపోరాదు.

**మధుర:** 'కీర్తి జలతారు పూతతో నామూర్తి మారిందా?' అని మీరే డవుటులో పడ్డారొకప్పుడు. 'నా వెన్నంటి నడిచే నీడలారా, నన్నువిడిచి వెళ్లకండి' అన్నారు కదా! సూర్యుడు తోడుంటాడు; మీ దోషాలను మాడుస్తూ, మీనీడలను నడిపిస్తూ.

**సినారె:** అవును. పచ్చని మొక్కల్లాంటి మనుష్యుల మధ్య మంచెలా తలెత్తుకు నిలుస్తాను.



[illegible]

14/8/96

229

229

# MADHURAVANI INTERVIEW-LU

A "First of its kind" book (Collection of Imaginary Interviews conducted by a popular character from a great play with a few chosen literary Wizards)

*by*
Puranam Subrahmanya Sarma (1929-96)


3-6-364/1, Road No.1, Lane No. 1,
Himayat Nagar, Hyderabad - 500 029

*Cover Portrait* **'Madhuravani'**: BAPU
Back Cover Photograph : BHUSHAN
Inside Caricatures : CHANDRA

*Conceived and executed by*
Bhamidipati Rama Gopalam (BHARAGO)

*Typeset, Designed and Printed at*
**Kala Jyothi Process Ltd.,**
1-1-60/5, Iftekar Mansion Lane, Musheerabad,
Hyderabad - 500 020. (Ph. 7613220, 7612436)

*For Copies :*
Visalandhra Book House (All branches)
Navodaya Publishers : Vijayawada 520 002.
Navodaya Book House : Lane Opp. Arya Samaj Mandir
Hyderabad - 500 027.
Pallavi Publications, Durgaiah Street: Vijayawada - 520 002.

**Price Rs. 80; $ 10.00**

232

MADHURAVANI INTERVIEW-LU : Puranam Subrahmanya Sarma



Puranam Subrahmanya Sarma (1929-96) Story Writer, Novelist, Essayist, Critic, Columnist, a discreet enthusiastic reader and an Editor - "ALL - in - ONE".

The present collection of imaginary interviews is as delightful and as penetrating for its wide sweep; as its provocative insight into the leading personalities of Telugu Literature.

"Here is a brilliant and novel literary feat of a unique nature that coalesces solid content with a racy style. This is literary history in a brand new format which only a person with an impeccable literary background could attempt and for it to succeed needed a pen that tempts. Puranam Subrahmanya Sarma has created a new literary genre with an authority and quality that will be difficult to match. PS' story 'Neeli' has attracted international attention, his 'Illali Mucchahatlu' are ever fresh but it is on these 'Interviews with Maduravani' that he will be read and rememebered in the centuries to come".

Vakati Panduranga Rao
*Editor, (Literary Supplement)*
A.P. Times (Daily)

**Price Rs. 80**

